# రాణాప్రతాపసింగ్.



చారిత్రక

నాటకము

విశాఖపట్టణమందలి సి. బి. ఎమ్. హైస్కూలులో

ప్రథమాంధ్రోపాధ్యాయులును,

రసపుత్రవిజయనాటక గ్రంథకర్తయునగు

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారిచే

రచింపబడియె.

---

ప్రకటనకర్త

**కురుకూరి సుబ్బారావు,**

బుక్కు సెల్లరు అండ్ పబ్లిషరు,

భీమడో [illegible], (కృష్ణాజిల్లా)

ం. 1925. వెల 1-0-0

కాకినాడ

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

# రసపుత్రవిజయము.

(గ్రంథకర్త — శ్రీ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ గారు.)

ఏరసపుత్రవీరజ్యోతి హైందవ సామ్రాజ్య లక్ష్మీధురంధరుఁడగు నాలంఘీరుబాదుసా నురూ్రితలూగించెనో, ఏప్రచండవీరావతారము రాజకీయరంగమున నవనవాదర్శములం బ్రదర్శించెనో, ఏవీరసింహనామము శాత్రవగజములకు సింహస్వప్నమో యామేవాడ హర్యక్షమగు రాజసింహుని దివ్యచరిత్రము! ఠాకూర్ దుర్గాదాస ఈనాటకమున సన్న్యాసివేషమున స్వాతంత్ర్యసంపాదనము సలిపెను. వీరమాత మహావీరమాతయై వెలసిల్లినది; విమలమానసయగు విమల — ఏనారీలలామము జన్మమున, రూపనగరాధీశ్వరుని గర్భవారాశితోపాటు భారతేందిరాలలామము ధన్యురాలయ్యెనో — యాకల్యాణగుణవతి, శ్రీరాజసింహవిమలపాణిగ్రహణాధీనమనస్కయై కావించిన యమానుష కృత్యములు — వీరవిహారములు — పడినకష్టములు చదివితీరవలయును; విమలసోదరి యగు ధర్మచ్యుత కేసరీబేగం, అలంఘీరు బాద్షాను పెండ్లియాడి విమలతోఁ బ్రతినబూని యామెను తురకకిచ్చి పెండ్లిచేయ యత్నించి తుదకు తానే రసపుత్రుల చేతులంబోఁ బడుట, ఔరంగజేబు సేన లాహారపానీయములు లేక గుహలో చిక్కుపడుట, దుర్గాదాసు ప్రచ్ఛన్న వేషమున, రూపనగర భైరవాలయమున చెప్పిన జ్యోతిషమున శృంగార రసోదయ మగుచున్నది. విమల విసరినపూలగుత్తి మన్మథుని శిరంగికుండై రాజసింహుని వక్షమునందగులుట, చదువరుల నానందరసాంబుధిని నోలలాడించును. గులాము చంద్రభోగల హాస్యము, తురక పెండ్లికొడుకు వెఱ్ఱిసరసము, గులాము చమత్కారము బాలుండగు అజితసింహుని శూరత్వము-అద్భుతరససమన్వితములు. వింతలోవింత-విమలను గాపాడుటకై మగవేషముతో వచ్చిన, వీరమాతను గాంచి విమల రాజసింహునిగా నెంచి శృంగారసంభాషణము చేయుట, ఆసమయమునకే వచ్చిన రాజసింహుడు వీరమాతను పరపురుషునిగ భ్రమించి యాగ్రహపడుట మిగుల చమత్కారరంగము. అలంఘీరు కాశీవిశ్వేశ్వరాలయధ్వంసనుచేయుట, హిందూవులమానసములం గలచి గగుర్పాటు గలిగించుట-వేయేల-దేశభక్తి పూరితము. పద్యములొక్కొకటి లక్షరూపాయల విలువ గలది. ఆంధ్రదేశ రంగస్థలములందంతట వీరతాండవము సల్పిన మహాచరిత్రవీర నాటకము. ఔరంగజేబు పరిపాలనమంత్రయు నిందున్నది. చదివిచూడుడు. నవరసములు వర్షించు నాటకము. ఇప్పుడిట్టినాటకరాజమే తెలుగున రచింపఁబడుటలేదు.

వెల 1—0—0

దొరుకువారు — కురుకూరి సుబ్బారావు
బుక్కుసెల్లర్, భీమడోలు
కృష్ణాజిల్లా ఆనిశ్రాయుదలెను.

శ్రీ

# రాజపుత్రతేజఃపుంజము

(రాణాప్రతాపసింగ్)



చారిత్రక నాటకము

విశాఖపట్టణమందలి సి. బి. ఎమ్. హైస్కూలులో
ప్రధానాంధ్రోపాధ్యాయులును,
రసపుత్రవిజయనాటక గ్రంథకర్తయు నగు
ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారిచే
రచింపఁబడియె

ప్రకటనకర్త:
కురుకూరి సుబ్బారావు,
బుక్కుసెల్లర్ అండ్ పబ్లిషర్,
భీమడోలు, కృష్ణాజిల్లా



రెండవ కూర్పు 1000 ప్రతులు.



కాకినాడ:
కోటమర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1925



[వెల 1—0—0

# నాటకమున వచ్చు పాత్రములు.



## పురుషులు.

రాణాప్రతాపసింగు—కథానాయకుఁడు, చిత్తూరు రాణా.

బ్రాహ్మణభట్టు—ప్రతాపుని యనుచరుఁడు.

జయసింగు—ప్రతాపుని సర్దారుఁడు, మోహిని భర్త.

అమరసింహుఁడు—ప్రతాపుని పుత్రుఁడు.

అక్బరు—ఢిల్లీ పాదుషా.

సలీమ్—అక్బరు కుమారుఁడు.

గులామ్—సలీమ్ సేవకుఁడు.

మానసింగ్—జయపురపు రాజు, పాదుషాయున్న సర్దారు.

పృథ్వీరాజు—ప్రతాపుని బావ.

సాగరజీ—ప్రతాపుని సోదరుఁడు.

అబుల్ ఫజల్—అక్బరు గురువు.

వజీర్—అక్బరుమంత్రి.

రణమల్లుఁడు—రత్నపూరు రాజు, మోహిని తాత.

భిల్లులు, సిద్దీలు, అర్చకుఁడు, జాంఘికుఁడు మొదలగు వారు.

## స్త్రీలు.

కరుణాదేవి—ప్రతాపుని భార్య.

కమల—ప్రతాపపుత్రి, పసిబిడ్డ.

మోహిని—రణమల్లుని దౌహిత్రి, జయసింహుని భార్య.

కమలాదేవి<br>చిత్రకారిణి } పృథ్వీరాజు భార్య. ప్రతాపుని సోదరి.

చంద్రికళ—భోగముది. సాగరజీ యుంపుడుకత్తె.



మతిముదంబునఁ బాడెను నాంధ్రమాత
నిఖిలసంపత్సమేతయై నెగడుగాత.

సూత్ర—(నాంద్యంతమున నంజలిపట్టి) దేశాభిమానులగు సభాసదులారా!

చ. కలుముల వేల్పు, పాల్కడలి గారవుపట్టికి పుట్టినిల్లు, ఆ
పాలఁతి నుతింపు వెన్నునకు బొడ్డున నూనిక, నా సతీపతుల్
చెలువుగ నెన్ను చిన్నిసుతు సింగిరికోల బుధానుకూలమై
యలరెడు తెన్గునాఁడు, కుసుమాంజలి దీసి బరిగ్రహింపుఁడీ.

ఆర్యవర్యులారా! నేఁడు ప్రయోగింప నెంచిన కథావస్తుతత్త్వము మనభారతవర్ష చారిత్రమున కెల్ల నమూల్యాలంకార సదృశము. ఏతత్కథానాయకాగ్రణి భారతసార్వభౌమమాలలో మేరుమణిగాఁ బేర్కొనఁదగు చిత్తూరుమహారాణాయగు రాణాప్రతాపసింగు. అద్వితీయరాజనీతికోవిదుండగు నక్బరుపాదుషా యంతవాఁడు తన్ను సాధింప నెంచి చతురోపాయంబుల సహాయశక్తుల నెంతప్రయత్నించినను జితోస్మి యనుమాట తననోటరానీయక యిరువది సంవత్సరములకుఁ బైఁగా నాటవికులమధ్య భార్యాపుత్రాదులతో పడరాని యిక్కట్టులకుం బాల్పడి తుట్టతుదకు మ్లేచ్ఛసార్వభౌముని మహాసైన్యమును తదధికారులగు హింగూయమహమ్మదీయ దండనాయకులను స్వకీయమహాబల మహాబలప్రసారంబున నూడిబుంగలవలెఁ బారఁదోలి శత్రువశములైన దుర్గములతో పాటు రాజధానియగు నుదయపురమును స్వాధీనముచేసికొని మేవాడ రాజ్యలక్ష్మికి మ్లేచ్ఛ సంపర్క కళంకము లేకుండఁజేసి రసపుత్ర ప్రతిష్ఠ పునరుద్ధారణముచేసిన మహానుభావుఁడు. ఏతన్నాటకరాజమునందలి నీతిరాజ మేమన,

ఉ. ఆపదలందు ధైర్యము సుఖాస్పదమౌ; నిజకార్యసిద్ధి దీ
ర్ఘోపరతిన్ లభించునను సత్యము నిత్యము చాటితెల్పగన్
మాపకరీతి వ్రాసె నలనో వెనరే దయఁ జిత్తగింపుఁడీ
చాపపురాయఁ జ్ఞానియులిల సత్కృతిఁ దత్కృతి నచ్చుమెచ్చుకృతిన్.

సూత్ర—(తెరవంక జూచి) సఖే! నేపథ్యమునందలి దృశ్యముగూడ శారదాగమవ్యాజంబున రాణాప్రతాపుని యుద్ధసన్నాహము నెఱింగించుచున్నది. ఇదే నాటక ముపక్రమింపం బడినట్లున్నది.

సీ. నిజవాహినీమనో నిక్షిప్తనియతినా
నిఖిలవాహినులలోఁ నీరు తేఱ
నిజబలోద్ధతి రిపువ్రజ మట్టులను మహా
బలరయోద్ధతి ఘనప్రతతి చెనకఁ
గిరిశృంగములనుండి తెర తెరంబును ఖేల
భల్లంబులన చిత్రజల్లు గురియ
తనకీర్తిలతలు దిక్తటులఁ బూచెనో నాఁగ
ముమ్మరమ్ముగ తెల్లు పూలుపూయ
తఱి నెఱఁగి వచ్చె నివె శరద్వాసరములు
ధైర్యసిద్ధియైన రాణాప్రతాపసింగు
యవనకలభాశ్రయోరు దుర్గాళిఁ గొనఁగ
సమర సన్నాహములలోఁను సలుపనొయ్యన.

నేఁబోయి ప్రదర్శనము జయప్రదముగావించు ప్రయత్నములో నుండెద.

(నిష్క్రమించును.]





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము

(చారిత్రక నాటకము.)



ప్రథమాంకము.

---

రంగము — కమల్ మీరు దుర్గ ప్రాంతమున నరణ్యము.

[చిత్తూరునగరాధిపుఁడగు ప్రతాపుఁడు పరిమితపరివారముతోడను
భార్యాపుత్రులతోడను నొకచెట్టునీడను విశ్రమించి యుండును.]

ప్రతా — మిత్రమా! బారుభట్టారకా!

శా. ఆలంబించు మహోగ్రగర్వమతి ప్రతాపాక్షుణ్ణ స్వాతంత్ర్యసం
క్షోభన్ రసపుత్రరాజ్యము మేవాడంబునం బెర్గ్న శౌ
ర్యాలంకారిణి నాకుఁ దల్లి యయి మీరాబాయి సత్కీర్తి తో
భూలోకఖ్యాతినిఁ బొందె నీయమ తీర్పు వేర్వనో నేనెనో. 1

బారుభట్టు — స్వామీ! నేను రాజవారినోట నెన్నఁడు నిట్టియుక్తులు వచ్చినట్లైనను
వినలేనిమాటలు వినవచ్చుచున్నవి. రాణిసతోడనిని వాఁడెదను నిన్నొదిమూసాను
పోని యెన్నఁడైన మొక్కవోవునా!

అమర — బారుభట్టారకా నీమాట నిశ్చయము.

గీ. కులిశహతికైన భీతిల్లి కుధరపంక్తి
యబ్ధిలోనను గహ్వరాళి యందొ డాఁగ
నాఁటినుండియు శౌర్యాగ్నిధర మొకండె
రగిలిరగిలి విజృంభించి పొగలఁజిమ్ము. 2

బాణ—సేబాష్. రాజపుత్రా! చక్కగాఁ జెప్పితివి. సింహవిక్రములగు నీయట్టికుమార వీరాగ్రేసరులు తనకడుపునఁ బొడముటచేత నేకదా మనచిత్తూరు నిశ్చయముగా వీరమాతయయినది. భ్రాతృద్రోహియగు సాగరజీ వంచించుటచే నొక్కపరి పరాజయము వచ్చిన వచ్చుగాక.

ప్రతా—బాణకవిశిరోమణీ! దేశద్రోహియగు సాగరజీ శత్రువుల నాశ్రయించెనని మే మధైర్యపడుచున్నామనుకొంటివా? అట్టివిచార మెన్నటికిలేదు. అట్టి పిఱికి పందలు పందలకొలంది యున్నను నిష్ప్రయోజనము. పుప్పిపంటివలన నొప్పియే కదా మిగులు.

[అంత ప్రతాపపుత్రియగు కమల యేడ్చుచువచ్చి తల్లిని కౌఁగిలించుకొనును.]

కమల—ఆ! ఆ! ఆ! అమ్మా! (ఏడ్చుచుఁ దల్లిని కౌఁగిలించుకొనును.)

అందఱు—(ఆత్రముతో) బిడ్డా! ఏమిసంభవించినది. భయములేదు చెప్పుము.

అమర—చెల్లీ కమలా! ఏడ్పుయేమి సంగతిచెప్పుము.

కరుణా—కుమారీ! భయములేదు. ఇదిగో! బాబాజీగారును అన్నయ్యయు సమక్షము ననే యున్నారు. భయకారణమేమి? ఏడ్పుమాని చప్పునచెప్పుము. ఏమమ్మా! మాటాడవు?

కమల—ఈదయము నాకిచ్చినరొట్టె కొంచెముతిని మిగిలిన దాచెట్టుతొఱ్ఱలోఁ దాఁచుకొంటిని. కొంటెపిల్లి యొకటి యచ్చటనుండియో యటకవచ్చి దానిని తిని వేసినది.

అమర—అయ్యో! కమలా! ఇందుకేనా యింతవంత. పోనీ నావంతునకు వచ్చినరొట్టె నీకిచ్చివేతునులే. (చేరఁదీసి) ఛీ! ఛీ! ఇంతమాత్రమునకే యేడ్తురా?

ప్రతా—బాణభట్టారకా! మాయవస్థ చూచితివా?

గీ. ప్రతిభ చిత్తూరునకు మహారాజు నేను
రాణి సుకుమారి రహపూరు రాకుమారి
బిడ్డ లాఁకటికోర్వ రొట్టె పెట్టలేక
పంచి యిడుచుంటి మహహా! మా బ్రతుకిఁ కేల? 3

ఆహా! కాలవైపరీత్యము! నిజమునకు మాయట్టి నిరుపేద లెందైన నుందురా?

చ. నిలువఁగ నీడలేదు కడు నమ్మదిగా క్షణమాత్ర మేనియున్
కుడువఁగ కూడు లేదకట కట్టలు కేసియుఁ బొట్టనిండఁగా!

తోడుగఁగ గడ్డలేకగద త్రోయ్యలికేనియు మేనునిండ! ఈ
ఫలమిడ బ్రహ్మకెంతకఁగవారమొ, మ్లేచ్ఛులదెంతయూహ్యలో!

కరుణా—ఓప్రాణేశ్వరా! దేవరవారే అట్లుతలంచుట భావ్యమా? మాకు మీరే సర్వైశ్వర్యములు. దేవరవారి సన్నిధానమే పెన్నిధానమని మేము పొంగుచుండ తమరిట్టి వెలితిమాటలాడి నన్ను కలతపెట్టెదరా?

శా. లో దుద్దానను లేదు; మీయశము చాలున్నాకు; కామ్యప్రదం
బౌట న్మీదగు సన్నిధానమదె మా కొంబెన్నిధానంబు; ఆ
కోటల్ పేటలు శాశ్వతంబులె! యశః కోటీరమే నిత్యమా
కోటీరంబదియబ్బు నేయుఁ దికిం గోటానుకోట్లుండినన్. 5

పత్రా—దేవీ! నీవెంతజేలవు! నీవి కృతయుగమునాటిమాటలు. ఈ కలికాలములో కీర్తి యెవ్వరికిఁగావలయును? చూడము! అంబరుపురాధీశ్వరుఁడగు మానసింహుఁడు—

కరుణా—హృదయేశ్వరా! అతనిపాంసనుని పేరెత్తకుఁడు.

గీ. కోటికి పడగెత్తియుఁ గీర్తిఁ గానఁడేకంటు
కాసు లేకున్న ధన్యుతెఁ గనునొకండు
దార నమ్మియు మూలకు దాసుఁడయ్యె
జగతి నుతిగాంచఁడే హరిశ్చంద్రవిభుఁడు. 6

ఇసీ! నశ్వరంబగు నీపాంచభౌతిక కాయమును బెంచునట్టిదియా నిజమైనధనము పారలౌకికసౌఖ్యంధనము. శాశ్వతకీర్తికాయమును బెంచుమానధనమే వాస్తవమైన ధనము సర్వసౌఖ్యసాధనమగుంగాక. అది యటుండ నాథా! మీరు పేదలెట్లయితిరి?

గీ. బిడ్డలను మ్లేచ్ఛులకు నమ్మి పేదవడిరె?
లేక తురకకుఁ దలనమ్మి లేమివడిరె?
మానధనులరు మీకు సమానులేరి?
ధనికులందెల్ల మీరలే ధనికులుసుఁడీ. 7

పత్రా—దేవీ! నిజము. నిజము. (తనలో) అక్కటా! నేనెంత మందుండను. ఇటులధైర్యపడి వీరిని మతింత తగ్గడిలఁజేయుచున్నాను. ఎంత పొరపాటు! లేనినిబ్బరమునైనఁ దెచ్చుకొని యీబంధుమిత్రులనోదార్పకున్న ప్రమాదము సంభ

వింపదా? (ప్రకాశముగా) మిత్రమా బాణభట్టారకా! ఏదో మాటవరుస కంటెనిగాని రాజ్యసుఖములు మాకింతకన్న వాంఛనీయములు కావు సుమా! నిశ్చయముగా స్వభావనిర్మితమగు నీయారావళీదుర్గమునందు వసించు నిపుడు గలుగు నానందములో శతాంశమైనను మాకు చిత్తూరు దుర్గమునందుండదు. ఎందు కందువా?

సీ. వంశనిర్మాత బప్పరావళుఁ డొట్టి
    నిన్న మాజనయిత్రి చన్నపఱను
ధరశిశోదియా వీరులు చూపిన
    మహితప్రతాపంబు మఱఁగకయును
అసహాయశూరుఁడై యొంటిఁ దొక్కఁడొకఁడె నె
    గ్గించిన సాహసకృత్యములును
దైవలోపమునఁ దత్కార్యభంగంబునఁ
    బ్రాప్తించిన విపత్పరంపరయును
గీ. ప్రతిబిలంబును శిలయు నిర్ఝరముల
క్షణముక్షణమిచ్చు బల ప్రతిధ్వనులు వినఁగ
నొడలు కంపించు లోనెత్తు రుడుకుఁదొడఁగు
కంట నీర్గారు సౌఖ్యేచ్ఛ కరఁగిపోవు. 8

బాణ—ప్రభుచంద్రమా! ఆపౌరుషపారుష్య పట్టిదే. ముఖప్రీతికిఁ గాదుగాని నిశ్చయముగా నీవిపచ్ఛోధనపరంపరలే దేవరవారి యప్రతిమాన పౌరుషవృద్ధికి కారణభూతములు.

సీ. రాపిడిసానపై రాపాడుపైఁగదా
    వజ్రంబు నిజకాంతి బయలువడుట
తతవహ్నికీలల తప్తమౌ పైఁగదా
    స్వర్ణంబు వర్ణాతిశయతఁ గనుట
పటుమేఘపటలిపై బారినపైఁగదా
    దినకరు తేజంబు ద్విగుణమగుట

తొలుకరిమాలిన్యంబు గలిచి పైఁగదా
నీలమేఘము వింత డాలుగొనుట

గీ. విధి విధించిన యీ విపద్వ్యాధి త్వదీయ
హృదయకుధరాంతరస్థమై పొదలు నొదిగి
అదరుబెదు రేది యాదనుకై యొగరుచూపు
త్వత్ప్రతాపాగ్ని ప్రజ్వలింపఁగ నెసుమ్ము.

[అంత సాళుంబ్రాధీశ్వరుండగు జయసింహుఁడు ప్రవేశించును.]

జయ—

ఉ. ఎన్నఁడుఁదా "జితోఽస్మి" యనుశబ్దము నెఱుఁగఁడు శౌర్యలక్ష్మికిన్
బెన్నిధిబూందితేఁడు కన వీరుఁడు, సూర్జనసాలు, మానసిం
గన్నవలంబడెం, గొలిచె సర్వరు, మ్లేచ్ఛులఁజేరినాఁ డికే
మున్నది పౌరుషంబుగల యోధులకున్ రసపుత్రసీమలన్. 10

బాణ—జయసింహకుమారా! నీవిప్పుడు చెప్పినది బందెలఖందు సూర్జనసాలుమాట యేనా?

జయ—ఔను నా శూరమ్మన్యుఁడే. అంతయును మానసింహుని దుర్మంత్రము.

అమర—ఏమేమి సూర్జనసాలే దేశద్రోహి యయ్యెనా?

గీ. 'మానధనుఁడను, దేశాభిమాన ఘనిన
నింటిలో మాకు నగ్రసోసిడినదె' యను
శౌర్యనిధిగాఁడె సూర్జనసాలనంగ!
తుదకు మ్లేచ్ఛుల జేరెనే తుచ్ఛబుద్ధి. 11

బాణ—ఆర్యా! మనయుద్యమమున కిదికొంత యుత్సాహభంగమే కావచ్చును.

ప్రతా—ఓయి వెఱ్ఱివాఁడా! బాణభట్టారకా! మనమహోద్యమ మెక్కడినితలమీఁదిదా యేమి? నాఁటి కురుక్షేత్ర సంగ్రామావసరంబున వీరశయనము నొందిన పవిత్ర క్షత్రియ వధరప్రష్టాలిఁబుగు, ఈరసపుత్రక్షేత్రంబుల నొక్కరసపుత్ర కుమారుండ మాత్రమేమిగిలియుండుంగాక! తుచ్ఛబుద్ధులగు మనసిపశుమ్లేచ్ఛులకు స్వేచ్ఛయు సౌఖ్యంబు నొసంగునవంబులసమా! వానిబుద్ధి వెడతలంబట్టి యా

మూర్జనసాలు తురకల నాశ్రయించిన నాశ్రయించుగాక. ఇంతమాత్రమున మన
కేమికొఱంత ?

ఉ. పోవఁగఁ బోవనిమ్ము! చెడిపో యినదేమి ? యొకండు వోయినం
జేవ నశించె నేమనకు, 'జేజయ కాళి' యటంచు బొందెలో
జీవము లుండుదాఁక రణసీమను కాలు కదల్పకుండి చా
వో విజయంబొ చూతుము సాధురుధిరాప్లుతులిందఱుఁ జెలంగఁగన్. 12

కుమారా! జయసింహా! బాలుఁడ వనిబుద్ధి గడ్డితివనని మే మిదివఱకే యనుకొంటిమి. చిత్తూరు కొత్తవార్తలేమి ? తత్క్షణమే వలసపోవలసినదిగాఁ బౌరు లందఱికిఁ గచ్చితముగా నుత్తరువుచేసి వచ్చితివిగదా !

జయ—చిత్తము. మొన్నటి గొల్లనిపాటు మొదలు నాఁటనుండియు నూరిపౌరిమేరల నుండు వ్యవసాయదారులుగూడ తమంతనే దూరగ్రామములకు పాఱిపోవుచున్నారు. ఇఁక చిత్తూరువార్తలకేమున్నది ! సాగరునికి పట్టముగట్ట నిశ్చయమైనది. మానసింహుఁడు స్వయముగావచ్చి పట్టాభిషేకము చేయునఁట.

ప్రతా—సంతోషమే!

బాల—ఏమీ! సాగరసింహుఁడు మహారాణావారిదా యిఁకమీఁద చిత్తూరుమహారణ్యపురాధిపత్యము ?

ప్రతా—మహారణ్యమైన మేలు. పరేతపురాధిపత్యమునుఁడు.

సీ. బ్రాహ్మణకుటుంబులు స్వస్తివాచకులుగా
నక్కకూఁతలు సూర్యవాదములుగ
రాబందుపులుఁగులు రాజబంధువులుగా
కాకిగుంపులు వందిగణముగాఁగ
జల్లేళ్ళ సేనలు జల్లుకొమ్ములుగాఁగ
బ్రహ్మదండులు బరాబరులుగాఁగఁ
కొఱవిబూచులు పల్లకుల వాహకులుగాఁగఁ
బైసాచమంట నివాళిగాఁగ

గీ. మనుజుఁడను వాఁడొకండు పేరునకు లేక
వల్లకాఁడైన చిత్తూరు పట్టమునఁ దల

కట్టుకొమ్మను సాగర్జీ గణించి నేఁడు
మానసింగన్న మదిఁ గోసి మమతదీఱ 13

అమర—మిత్రమా జయసింహా! సాగర్జీపై మానసింహున కంత యనుగ్రహము పుట్టుటకుఁ గారణమేమై యుండును.

జయ—ఏమో దానియాథార్థ్యము నాకుఁ దెలియదు గాని లోకులిట్లనుకొనుచున్నారు.

ప్రతా—ఎట్లు ?

జయ—కలదుగదా సాగర్జీకి ప్రథమకళత్రమువలన గలిగిన పుత్రి మోహినీబాయి. రత్నపురాధీశ్వరుఁడగు రణమల్లుని దౌహిత్రి, సంప్రాప్తయౌవన. ఆమెను మొగలాయీరాజనానాకు డోలాగాఁ బంపునట్లు సాగర్జీతో మానసింహుఁ డొప్పటుఁ జేసి తత్ప్రతిఫలముగా చిత్తూరుసింహాసన మీయ నుద్యుక్తు—

ప్రతా—హా! ఎంతదారుణ మెంతఘోరము! ఇదివఱకు మా శిశోదియావంశమున కిట్టి మచ్చ వచ్చియుండలేదు. హా! మానసింహా! దురభిమానసింహా! నాఁడు నీకు పంక్తిభోజనమీయని కార్పణ్యము నేఁ డిట్లా సాధింపం జూచితివి ! ఓరీ! అహంకారియుఁడా! మ్లేచ్ఛదాసా! ఇంతమాత్రమున నీసంకల్పము సిద్ధించునా? ఓరోరి దేశద్రోహీ! రసపుత్రవంశపాంసనా!

చ. పురుషుఁడవై కులంబునఁ బుట్టితివే యిది! స్త్రీవయైన ము
గరనిడి రాజుఁ బొందొడి గగమ్యపుఁ బొంతిపుఁ బంబుఁ జేర్పమే
తురకలమీఁది మోహమున దూకితి మొ పాకిము పోవుగాక, యా
కొఱఁతదొలంగు నీతను వ్రకూలిన, నాతఁడు చేసియుండు నవే. 14

అమర—ఓరి చండాలుఁడా, మానసింహా! నాఁడు కమలమీయరు మార్గమున మేముండగా నీవు వచ్చినపుడు మాబాబాజీగారు—

గీ. స్వాగతంబిదెఁ దారె రారనుచు నలిగి
పంక్తి భుజియింపలేదని పగ మనంగొని
అనికి మేల్లుఁ డోడితె వన్నమట నుడికి
గుండెలోనుండు పిరికితనంబు దెలుపితే. 15

ఔరా! ఇంతమాత్రమున నీకడుపుబ్బ తీరునా! ఏమో వెఱ్ఱిగా నాలోచించితినిగాని మాశిశోదియావంశమును జెఱుపుటకు నీప్రపితామహులు దిగిరావలయును సుమా!

పుట్టిననాటనుండియు మాతామహుని సంరక్షణలోనుండుట మోహినీబాయియం దెట్టి స్వామ్యమును సాగరజీకిలేదు. అది యటుండ నో కుటిలబుద్ధీ!

క. చిత్తూరు రాట్కులంబును
నుత్తమభూజప్రసూతుఁ డొకశాఖకుఁ డేఁ
గత్తిగొనిసల్వ నీదగు
నత్తుంగు జిత్తులును సాగునే! ఛీ! కుమతీ! 16

కరుణా—అక్కటా! ఆదుశ్చరితుని కార్పణ్య మెంతటి దారుణములను జేయించు చున్నది.

క. ఆకూళ తాను చెఱుటయె
కాక శిశోదియకులంపు గౌరవ మెల్లన్
బోకార్ప నెంచె నిష్ఫలము
శోకంబోల్పడిన నక్కటా శోయమునఁ గటా. 17

ప్రతా—అదియేమి! జయసింహా! నీచేతిలోనేదియో యుత్తరమువలె నున్నది.

జయ—ప్రభుచంద్రమా! నే చిత్తూరునుండి రత్నపురిమీఁదుగా వచ్చుచుండ నొకశిలీ ముఖముఖంబునుండి యీలేఖయుఁ గంకణంబును నాకుం దాఁకినవి. ఈ యుత్తరము పై దేవరవారివిలాసముండుటచే నుత్తలపడి దీనిం గొని తెచ్చితి.

ప్రతా—ఏదీ! చదువుము.

జయ—స్వ. శ్రీమన్మహారాజ! శ్రీరాజనామసురభూజ!
భూజన హృత్ప్రతాపభూతలేంద్ర!

ప్రతా—బిరుదులమాట కేమి? సారాంశమును జదువుము.

జయ—చిత్తము.

జామాత యే గర్భశత్రువై రాజ్యంబు
గూల్తుఁ గోరినకుఁ గూర్పనెంచె
కోటచుట్టు నరాతికోటి కావలియుంచె
మానసింహునితోడు మదిఁ దలంచి
నమ్మినబిడ్డయు నా రాజ్యమును బోవు
నెంటరి ననదనై యుంటినిచట

ఉ. నైపెరెంపు సంపదలు సర్వము పోయిన, గొండకోనలం
దే చవిచేసి కాయకసరే దిననైన, కుటుంబయుక్తుఁడై
నీచుల యిష్ట కొండగవిని స్వాసించుంపఁగనైన, నెట్టులా
గా చెడకోరి, తనంత కుంగారవహానికి సైపఁడెప్పుడున్. 21

ఇది మరిచుంచుకొని రయమ్మున పొమ్ము. సఫలమనోరథుండవై చనుదెమ్ము.

జయ—దేవీ! మహాప్రసాదము.

ప్రతా—కవిశిరోమణీ బాణభట్టారకా! మన కీకన్యామణి మానరక్షణము చిత్తూరు కోటకన్న మిన్న కావున మీరు ఢిల్లీకిఁబోయి మాబావ పృథ్వీరాజుం జూచి ప్రచ్ఛన్నవృత్తిని కార్యము మించకుండునట్లు మాచుమండవలయును. పృథ్వీరాయనితో తీరిక గలదేని మేమొకసారి రమ్మంటిమని చెప్పుఁడు.

బాణ—చిత్తము. సెలవు. (అందఱు నిష్క్రమింప తెరజారును.)



2. రంగము—మానసింహుని యభ్యంతరమందిరము.

మాన—(ఆలోచించుచు విశ్రమించియుండును.) అహాహా! రాజనీతియఁట! నీతిరాజమఁట! నేతిబీరకాయలోని నేతిరీతిని రాజనీతిలోని నీతిరాజము మాపక్రియాభావంబయి కేవలనామమాత్రావశిష్టంబయి పరమేష్ఠివిధంబున నధిష్ఠితంబయి యుండు. ఇందలి కార్యాకార్యము ప్రభుచిత్తమునుబట్టి దేశకాలపాత్రోచితంబుగా సమర్థింపఁబడుచుండును. ఇయ్యది శిష్టమో, దుష్టమో, మాన్యమో, హేయమో, వంద్యమో, నింద్యమో, యిదమిత్థమని నిర్ధారణచేసి చెప్పుట కిప్పటి మనిషా విశేషజ్ఞులకు ప్రాజ్ఞత చాలదు.

మ. మఱి ధారాగ్రనిశాతమై నవసుధాప్రక్షాళితాంభోజ మా
ర్దవమై దుర్దమ సిద్ధయోద్ధతగుణప్రాగల్భ్యమై సత్కృపా
ర్ద్రవిసర్పాంకుల భావపూర్ణతనుమై ప్రాచుర్యమై గోప్యమై
యనిస్వర్తిలు రాజనీతిగతి సత్యాసత్యసంయుక్తమై. 23

ఇది యతింగిరియేకదా మర్త్యలోకవాచస్పతియని చెప్పనొప్పు భర్తృహరి తన సుభాషితముల రాజనీతిని వారకాంతకు సరిపోల్చెను. ఔనౌను. అర్థసంగ్రహావసరంబున నుచ్చనీచపద విచక్షణ మావంతయులేక, స్వకార్యసంసిద్ధికై జాతినీతుల ననులోమవిలోమంబుల వాసి పీసవంతేని పాటింపక యొక్కచో బుద్ధునిమ్మఱపించు భూతదయయు, ఇం

కొకయెడ కసాయివానిం దీసిపోని కాఠిన్యతయును, ఒకదెస శిబికర్ణదధీచులం దృణీకరింపఁజాలు త్యాగశీలతయు, నొండొకదండ మలభక్షకుండగు లుబ్ధాగ్రేసరచక్రవర్తిన్మఱపింపఁజాలు పిసినిగొట్టుతనమునుం గలిగి సమయానువర్తనప్రవర్తిని యగు రాజనీతి వేశ్యకాంత కాదు వేశ్యమాతయే యేలకాకుండును. ఇంతయేల? ఈపరమరహస్యము తనబాహ్యాంతరచారిత్రముల నాదర్శప్రాయముగాఁ జూపుకొనుచుండుటచేత నేగదా మా యక్బరుచక్రవర్తి పులిపందివారడికైనడి జాతిమతవైషమ్యములం బెట్టుకొని యొండొరులంగనినంతనే భగ్గునమండిపడుచుండు యవనహిందూజనమాన్య సామాన్యులం దన న్యసామాన్యసౌజన్యము నందఁజాలి, ఆ సేతుశీతాచల మహామహీతలంబు నెల్ల నేకచ్ఛత్రాధిపత్యంబుగా నేలి యిరుదెఱంగులవారి నొక్కత్రాటి నడపించుచున్నవాఁడు. ఆహా లౌక్యుఁడన నక్బరే పరమలౌక్యుఁడు. రాజనీతియన నాతనిదే రాజనీతి!

అట్టి యాతనివిఖ్యాతరాజనీతి కతీతంబగు నీతిరాజంబును చతుర్విదోపాయములఁ బ్రయోగించి దేశమాతనైన నా ఆఱుశతాబ్దములనుండి గోల్పోయిన స్వాతంత్ర్యసౌభాగ్యమును ఆర్యావర్తములోఁ బునరుద్ధారణము చేయుటకై తదీయరాష్ట్రాధిపతులఁ బ్రబోధించి శక్తివంతులం జేయ సమకట్టియే గదా హిందూమహామ్మదీయ సమ్మేళనమున కాదిని మాతండ్రిగారగు భగవాన్దాసుగారేమి ప్రస్తుతము మేమేమి శక్తివంచనలేక ప్రయత్నించుచున్నారము. మా రసపుత్రులలోఁ గొందఱు ముఖ్యముగా మేవారువారీమా సంకల్పమర్మముం గ్రహింపఁజాలక మా మనోగతప్రతీతులకు విపరీతవ్యాఖ్యాతలై మేమేమో వర్ణసంకరము చేయఁ గంకణము గట్టుకొన్నార మనియు, పతివ్రతాధర్మంబున సనాతనప్రఖ్యాతిగాంచిన రాజపుత్రసతీమణుల సతీత్వము నంటఁగలుపుచున్నార మనియు గంఠశోషగాఁ బలుకుచున్నారు. చేతఁగాని ప్రతాపుని రీతిని సతీ సుతాదులతోఁ గొండకోనలం బట్టి కూఁడుగుడ్డలకు మొగము వాఁచి మానమో మానమో యని కోఁతి పిడికిలిని బట్టిన నణుమాత్రమైన లాభ మున్నదా!

ఇప్పుడాతని తమ్ముఁడే తనకూఁతు మొగలాయీ జనానాకు డోలాగాఁ బంప సంసిద్ధుఁడైయున్నాఁడే. తానేమిచేయఁజాలెను! సాగరజీ తనతమ్ముఁడు గాఁడా, మోహినీబాయి తనవంశమునఁ బుట్టలేదా!

మ. అవివేకంబున నగ్నిపక్షి తనుఁడాయన్వచ్చు నవ్వారిక
న్గవ మూయన్మదిలోఁ దలంచి యిసుకం గంఠంబుఁజొప్పించి త
న్నెవరుం జూడఁగ లేదటంచు నెదహాయింబొందుచుండానఁ దా
ను నశించేరె సరే! కులంపుదుశ మన్యుం జెందనీ కాపనే. 24

వాఁడు ప్రతాపుఁడేమనియెను! మా శిశోదియావంశమునఁ బుట్టిన శునియేనియు నన్యమతిసంపర్కము నేవగించుకొనదా! ఇప్పుడేమనునో. చేతగాని ప్రగల్భములు! అఖిల భారతీయ మహాసామ్రాజ్య శాసనమునకు లోనగు నక్బరుషాను మహా యంతవానిని చిత్తము వచ్చినట్లు కీలుబొమ్మవలె నాడింపఁజాలు మానసింహునితోడ నా పంతముపట్టి నెగ్గించుకొనుట! ఎట్లయిన మోహినీబాయి నిచ్చటికి రప్పించితినా ప్రతాపునివంశప్రతిష్ఠ వామపాదాంగుష్ఠముక్రిందఁ బెట్టి నలిపివేసినవాఁడనే! సలీముం గులామునుం గావించినవాఁడనే! మదీయభాగినేయుండగు కుసురూను భారతవర్ష మహాసామ్రాజ్య పట్టభద్రుం జేసి భవిష్యద్రాజ్యతంత్రంబంతయు నస్మదీయహస్తగతంబు గావించుకొనినవాఁడనే. ఇప్పుడామాటలెందుకు! తనచాకచక్యముచే సాగరజీని వలలోఁ వైచుకొనుటకై పంపబడిన భూలోకాప్సరస చంద్రికళ యింకను రాలేదు.

[అంత సేవకుఁడు ప్రవేశించును.]

సేవ—మహారాజా! ఉదయపురమునుండి చంద్రికళ డోలావచ్చినది.

మాన—సరే! రావమ్మను.

సేవ—చిత్తము.

చంద్రి—అంబరపురాధీశ్వరా! జోహారు! జోహారు!

మాన—ఓహో! చంద్రికళ! ఉదయపురమునుండియేనా రాక?

చంద్రి—చిత్తము.

మాన—ఏమయ్యెను? సాగరజీ నెంతవఱకుఁ దెచ్చితివి?

చంద్రి—సాగరజీ నాకు దాసుఁడయ్యెను.

మాన—ఎట్లు?

చంద్రి—గాంధర్వమున.

మాన—ఏమీ! నీ గాంధర్వవిద్యామహిమచేతనా?

చంద్రి—మదీయ గాంధర్వవిద్యాదాసుఁడై గాంధర్వవిధిని నన్నుం బెండ్లియాడ నున్నాడు.

మాన—ఏఁడీ! ఆతఁడెక్కడ?

చంద్రి—ఎక్కడనుండును! నన్ను విడిచి యొకనిమిషమైన నుండఁగలఁడా? నాతోడనే వచ్చెను.

మాన—సెబాస్ చంద్రికళా! నీవెంత నెఱజాణవే! మోహినిసంగతి?

చంద్రి—మోహిని రేపటి నెల్లుట మొగలాయీజనానాకు డోలాగాఁ బంపఁబడును. రత్నపూరు ముట్టడి జరుగుచున్నదిగదా! తమరు నటువైపు దయచేయుదురన్నా రని వింటిని.

మాన—ఏమో! ఆసంగతి నేటిదర్బారులోఁగాని తేలదు.

సేవ—(ప్రవేశించి) మహాప్రభూ! దర్బారునకు దయచేయుఁడని పాదుషావారి సెలవు.

చంద్రి—నే నిఁక సెలవుతీసికొనవచ్చు ననుకొందును.

మాన—సరే! సాయంకాలము సావకాశముగాఁ గూర్చుందము. నీసంగీతము విననాకును చెవులూఱుచుండును.

చంద్రి—(తనలో) ఈదిక్కుమాలినపాట నాకెక్కడ వచ్చినదో గాని అహోరాత్రము లరవైగడియలు నాకు సంగీతసభలకే చాలకున్నవి. రాజధానిలో కాలుపెట్టితినో లేదో గులాముచేత సలీంరాకుమారుని వర్తమానము. పోతే మానభంగము! పోకుంటేప్రాణభంగము! (పైకి) ఇప్పుడు దర్బారునకు నేను రాకతీరదుకదా!

మాన—అన్నట్లు నీవు సలీంరాకుమారుని యొద్దకుఁ బోయినప్పుడు మోహినీవ్యామోహ ప్రవాహము పరాకుపడకు.

చంద్రి—అదిగో! చూచితిగా మఱి? ప్రస్తుతము రాజకార్యములయందు గెలుపుకూడ ప్రబలులగు పురుషుల భుజబల బుద్ధిబలముల కసాధ్యమై మాబోంట్ల యబలల మీఁదనే పడుచున్నది.

మాన—చంద్రికళా! నీ వబలవా. ప్రబలులగు పూరుషుల వేయిమందిని జాపి పుట్టితివి

సీ॥ సంగీతరస మింత చవిచూపినంగాని
పట్టి పండ్లిగిలించి భ్రాంతిపడును.
అభినయకళ నొక్క హస్తంబుపట్టవి
ఘ్మ్నశుఁడైనను పెండ్లి కాశపడును
సరసప్రసంగవైఖరి కింత దొరకొన్న
శుకుఁడే [illegible]ము వ్రతంబు జూఱఁబుచ్చు
మెఱుఁగుఁదీఁగఁబోలు మేనిహొయల్ చూప
భీష్ముఁడేని యనంగపీడితుఁడగు

గీ. చక్రిచక్రంబు వజ్రివజ్రముఁ బినాక
పాణిశూలంబు కన్నను వాఁడిగాదె
చేఁడె నీమోరచూపను వాఁడితూఁపు
విటుల ధృతిఁజీల్చు నన్నచో వింత యేమి! 25

చంద్రి—సరే! ఇట్లే నన్నుబ్బించి చేయవలసిన పనులు చేయించుకొను చుండుఁడు. నేనిఁక సెలవుపుచ్చుకొందును.

(నిష్క్రమింపఁగాఁ దెరజాఱును.)





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము



## ద్వితీయాంకము.

---

రంగము — కోటలోనుండి ఘాదుషాదర్బారుభవనమునకుం బోవు ప్రత్యేకమార్గము.

[గులాం హుక్కా నెమ్మాయును, సలీం సారాసీసాయును బట్టుకొని ప్రవేశింతురు.]

సలీం — అరే! గులాం! ఇప్పుడు నాదగ్గిర నీవు చెప్పిన జోలామోహినీబాయి అంత అంద వుందిరా?

గులాం — ఆ! అచ్ఛా! బతేలాయక్సేవుంది సర్కార్! మిహిరా ఉన్నీసాకి అంత హుందం, సందం ఉంది లేదూ అందర్ కోందర్ అంతార్.

సలీం — (బుడ్డిపై చరచుకొట్టి) చుపారివ్! చోడ్దేవ్! ఉన్నీసాకీ దీనికి సమం చస్తావ్. మిహిరాకి సమం జహాన్మే నహీ. అందుకే దానికి నేమ్ నూర్జహాన్ ఖితాబ్ యిచ్చినామ్.

గులాం — జూటాబాత్ కాద్ సర్కార్! సాగర్జి జేటీబహుత్ లాయిక్సేవుంది. కందూ లేని చందూదాని మొహం చందనేకి గందమ్మే హుంది దేహం. హుందమ్మే సందమ్మే యెందరైనా సుందరికి నహీబోల్సక్తా సునో సర్కార్.

సలీం — అరె గులాం! అయితే అది అంత అందమైంది చెప్తావ్! దానితో హాసప్యం స్నేహం చెయ్యాల. ఇందుకు మహాజీ రాజామాన్‌సింగుతో ఖాసీకే బందోబస్తుచేయ్యాల!

గులాం — అమ్మాజీ జోద్బాయి బేగమ్ తలఫ్ సే సే దరోబస్తు మనంలో అనుకూలం అయిపోతాదీ సర్కార్.

సలీం—నహీ! నహీ! అక్డ బడేతంటావుంది. ఉన్నీసా కమామిష్ ఉల్టాసీదా అయింది యిందే. నీకీమాలుమ్?

గులాం—నహీనహీ సర్కార్! నాదిబుద్ధి మట్టీ ముద్దా. తెల్వాదు.

సలీం—(వీపుపైగుద్ది) జారే! హైవాన్! నీకిబుద్ధియెక్డావుంది? (చెవిలో నేమో చెప్పి) మాలుమ్ రే!

గులాం—అచ్ఛా! సర్కార్! మాలుమ్. గల్లాఖాలీఅయిపోయి ఆలోపల బుద్ధీ అంతా ఏక్దం పైకీ వచ్చేసింది!

సలీం—హాహాహా గులాం జరూర్సే దారూఖానాకుజాన్. పరాంస్ దేశ్‌బిలాతీసర్కార్ పకార్‌రకమ్ తాజా దారు వచ్చివుంది విన్నామ్. తీన్ సీసా తీసుకురా! ఈ కచ్చా కచ్చారకం మంచి నిషా సేసేది లేదు.

గులాం—జీసర్కార్! ఉన్నామాంఘ్ పోయి కొన్నాదంతా పట్కావస్తామ్ మాకీ క్యా ఫర్వా?

జరూర్సె హంపాస్సే యెల్లిపోతామ్
పరాంస్ దేశం సర్కార్ కెట్కాస్తామ్
బరాబర్ మర్కార్ కే నిషాసేస్తామ్
నోరోజా ఆసాకు నహీం క్ సెప్తామ్॥

(గంతుచు పాడుచు పోయి తెచ్చి యిచ్చును.)

సలీం—(త్రాగి) ఆ! అచ్ఛానిషాఅవుతూవుండాది. అరె గులాంక్‌సా మాకీ ఫేక్మే పోయి.

గులాం—(విశారముగా పోయుచుగా సలీంత్రాగును. గులాం మిగిలినది త్రాగును. గంతుచు పాడుచుందురు.)

పాట—పరాంస్ దేశం దారూ పకార్ నిషా సేసి
బికార్ సిర్ కా సాకి సికార్ సేస్తామ్
నోరోజా పహాగ్మే కాఫ్ వేషం యేసి
భేషూక్సే పోపక్ తమాషా సేస్తామ్
సలీం సర్కార్ జీకి ఖోలాసా సాయించి
తాజాజవ్వారీమే నజార్ కొట్టాం

జులుమ్ సే అలహాబాద్ కోటా లూటీ సేసి
హుజూర్ ఖజానా బజారీ పెట్టాం.

(తెరయెత్తఁబడును.)

దర్బారు.

[లోపల అక్బరుఫాదుషా మంత్రి సామంత పరివేష్టితుండై కొలువుతీర్చి యుండును. వంది మాగధ గాయన గాయకులు తమతమ పనులు నిర్వర్తించుచుందురు.]

అక్బరు—గాయన గాయనీశిరోమణులారా! మీమీ వినోదములింక విరమింపుఁడు. చంద్రికా! అభినవంబగు నీయభినయ విద్యావైభవ మెంతయు నభినందనీయము. దర్బారుముగిసిన వెనుక పారితోషికమందఁగలవు. ఈలోపున కార్యాంతరములున్న చక్కఁజేసికొనిరమ్మా. పొమ్మా.

చంద్రి—చిత్తము. ఫాదుషావారికి ఖుద్దునకొకయర్జి దాఖలుచేసికొన వేచియున్నదాన.

అక్బ—ఏదీ! ఇటు తెమ్మా. (చూచి) సరి! నీ కార్యములందప్రమత్తురాలవై మెలంగుము. నీకోరిక నెరవేరఁగలదు. పొమ్మా.

చంద్రి—చిత్తము. దర్బారుముగియులోపల ఢిల్లీలోని పూర్వపరిచితములగు రాణివాసములకేగి యభ్యంతరమందిరంబులఁ బునర్దర్శనము చేసికొందును.

అక్బరు—మంచిది. (చంద్రిక నిష్క్రమించును.)

అక్బ—మిత్రులారా! నేఁడు ప్రతాపునిచే పంపఁబడినదను సందేశము కడు సందేహాస్పదముగా నున్నది. అతుల ప్రతాప తేజఃపుంజమగు ప్రతాపుఁడప్పుడైన పశ్చాత్తాపతప్తుఁడయ్యెనని వినుట సంతోషమే కాని యీవర్తమాన మెంతవఱకు విశ్వసపాత్రమైనదియో బుద్ధిమంతులగు మీరే యోచింపుఁడు.

మానసింగు—సార్వభౌమచంద్రా! నమ్మకుండు టెట్లు?

అక్బరు—ఎట్లా?

చ. ఇరువదిహాయనంబు లిటులేగ నితాంతపు టష్టకష్టముల్
దరిఁకొన నొక్కనాఁడు సిటు దైన్యపుటుత్తర మంపియుండె నే
శరణనునే ప్రతాపుఁ డసఁ జచ్చినఁ జచ్చునుగాక దీని నే
కరణిని నమ్మవచ్చు మతికాదను టెట్టులు దక్కుచుండఁగన్. 25

మాన—ఏమో! మానవజన్మముగదా! అందులో నాదినుండియు సుకుమారముగాఁ బెరిగిన ప్రాణి. ఇప్పుడు మానహానియని యంతకాలము త్రిమానుషముఁ జూపఁగలదు.

చ. కొమరులు మంత్రులున్ సతియుఁ గూఁతురుఁ గుడ్డను మోయుచాచి కా
ఱసపుల నెంత కాలమిటు దైన్యము నొందఁగఁ జూచి మూర్ఛఁ లో
బడవని మానవ ప్రభువుఁ బాతకు పట్టి నెట్లు నే సుఖం
పడ నెవఁగోరఁ జెప్పుఁడీ పాపిని యున్న జన్మమే గదా. 26

పృథ్వీరాజు—ఆర్యా! మానసింహా! అనన్యసామాన్య పౌరుషప్రతాపతేజఃపుంజమగు ప్రతాపుని ప్రకృతికిని సామాన్యమనుష్య ప్రకృతికిని హస్తిమశకాంతరము.

మ. రిపుకోటిన్ స్వవశీయకీర్తినిధి దోర్వీర్యప్రతాపోరు ధై
ర్యపరీతుండగుఁ గదా ప్రతాపుఁ డవ సర్వైశ్వర్యముల్ పోవనీ
తిరిపంబో నాకి జీవితోస్మియము ననునే తాకట్టుల న్వేమనే
విపరీతం బిది నమ్ము మెట్లు? రవి యున్నన్ వెన్నెల్ గాయునే.

మాన—ఓహో! అంతటిమానధనులా మీబావగారు ప్రతాపసింహమహారాణాగారు! ఇంతటి శూరసమ్రాట్చక్రవర్తులు గావుననే కాంబోలు నిప్పుడు మహారణ్యములో బిడాలచక్రవర్తులయి తిరుగుచున్నారు. ఎందుకో యింకను మొండితనము.

గీ. విడిచె చిత్తూరు నుదయపూర్వడిచినాఁడు
కమలమీయరను ద్వారంబు కడకు విడిచె
నిన్న హల్దిఘట్టున నన్ను విడిచె
విడువలేకుండె ప్రాణమే వెట్టియగుచు. 28

పృథ్వి—మానసింహా! పరోక్షమున పరిహాసింపుట మీ పౌరుషము.

మాన—ఇందు పరిహాసమేమున్నది? ఉన్న సంగతియే. చిత్తూరుకోటఁ గోల్పోలేదా, ఉదయపురముమాట ఉన్నదియా, హల్దిఘట్టున పలాయన మబద్ధమా; ఇఁక నున్న కమల్మియరు నిన్నమే మాక్రమించుకొనలేదా?

పృథ్వి—ఓహో! కమల్మియరు మీరు చేపట్టుకొన్న ముచ్చటయే మెచ్చవచ్చును.

ఉ. వక్రమతిన్ కమల్మియరు బావినిఁ బ్రావెడి నీటిలో విషా
వికిరిమిదో హా దంబగున క్ష్వేళముఁ గల్పఁ దమంతపోయి రా
యక్రమమా నుతింతు కృతివై నిజమెవ్వరెఱుంగనట్లు! సీ!
విక్రమమా భవాదృశులు వీరులకున్ రజనీచరక్రియల్. 29

మాన—చాలులే! ఇట్టి కనుపుబ్బుమాటలు దర్బారులో నమ్మువారెవ్వరును లేరు. ప్రతాపుని ప్రస్తుతస్థితినిబట్టి ముక్కుమూసికొని నీకంత యుత్సాహ మేల! నిజముగను ప్రతాపుఁడే మానవంతుఁడై యీస్థితిలో ప్రాణపరిత్యాగము చేసికొనియుండును.

పృథ్వి—ఓయీ! అతఁడొకవేళ నశ్వరమైన నీభౌతికదేహమును పరిత్యజించినను పరిత్యజించుఁగాక. జగద్విఖ్యాతమగు నాతనికీర్తికాంత మాత్రము క్షణక్షణాభివృద్ధి నిత్యమై శాశ్వతమై సజీవమై సకలదేశాభిమానిప్రాత్రఃస్మరణీయమై అజరామరమై సమస్తచరాచర సమన్వితాసేతుశీతాచలపర్యంతము నాట్యరంగస్థలంబున నఖండతాండవమాడుచునుండును సుమీ! ఇఁక కేవల లౌకికాయత్తమతప్రవర్తకులకు మనబోటులమాట నేమి విచారణీయము.

మాన—ఓయీ! చుట్టపక్కములకెంతటివారినైనను సరకుగొనని మాయము బుసు తలపెట్టుట కేమిహేతువు?

పృథ్వి—ఇదియు నున్నమాటయే. అందుల కనుకూలించుటకేల?

అక్బరు—ఓ రసపుత్రవీరులారా! శాంతింపుఁడు. మానసింహుని మాటలో పొరపాటు లేదు. ప్రతాపుని ప్రస్తుతస్థితినిబట్టి యాతఁడట్లాడెను.

మ. బలము లేదు, ధనంబులేదు, బలవద్వైరంబు సాధింపఁగాఁ
దలపోయుంగఁ బ్రతాపసింహునకుఁ జిత్తభ్రాంతి యేమి? భి
ల్లుల మూకంగొని ఢిల్లినాయకుఁ నెదుర్కొందునా నుక్కపోఁ
క లలిం బట్టుచు గొంతుకోనదికడుఁ గంకం బాఁటఁగా నెంచెనే. 30

అసహాయుండయిన ప్రతాపుఁడెంతధైర్యవంతుఁడైన నేమి ప్రయోజనము?

పృథ్వి—ప్రతాపుం డసహాయుం డెట్లగు? మున్నిటివారికి మనకు ప్రక్కలో బల్లెమగానుండిన జయమల్లుని పుత్రుండు జయసింహుండను మొదలగు సింహాలిక్రియ మెందఱో కలరు.

మాన—(కోపముతో) ఓహో! అట్లనా!

మ. జయసింహుండొక నీచుఁడే మగుడు; నీచన్యాయార్యాప్తింగాంచి యా
సయుఁడెందందగు నా ప్రతాపుఁ, డితుల చ్ఛాయం చుచిరా గ్నెచ్ఛనౌ;
జయమేగాని మతన్యూందెఱుంగదది, యస్మద్బాహుదండాసి మొ
ద్దంబుపో లేదుగదా ప్రతాపుదెస నేలా వ్యర్థవాగ్జాలముల్?. 31

అక్బరు—రాజా మానసింగజీ! మీయప్రతిమానప్రతాపంబునకు దుస్సాధ్యం బొండు కలదా! ఈసామ్రాజ్యమునం దర్ధభాగాధికము భవద్బాహుబలసంపాదితమే గదా! * * * *

ఆర్యా! పృథ్వీరాయా! ప్రతాపుని యుత్తరపు యథార్థోదంతంబులు దెలియఁ దమరొక్కపరి శ్రీమయనక కమల్మియర్ దుర్గమునకుఁ బోవలయును.

పృథ్వీ—చిత్తము. పాదుషావారు నాకుఁ బదునైదు దినములు గడువు దయచేయించిన నాయుత్తరపు నిజస్థితి నివేదింపఁగలను.

అక్బరు—మంచిది! రాజామానసింగజీ! రేపే మరల రత్నపురమునకు సలీంరాకుమారునితో నుచితబలసమన్వితులై పోవలయును. ఏడీ? సలీమెక్కడ?

అబుల్ ఫజల్—అదిగో యువరాజసింహాసనము నలంకరించి యున్నారు.

అక్బ—కుమారా!

సలీం—(పరధ్యానముగా నూరకుండును.)

అక్బ—(రిచ్చపోయి) అయ్యో! మాచితిరా? సర్వకాలసర్వావస్థల యందు నిట్లే. మిహిరను పంపివేసిననాటనుండియు నీతనియవస్థ యిట్లేయున్నది.

అబుల్—సమయము కని చక్కచేసిన స్వస్థపడవచ్చును.

అక్బ—ఏమో! అన్నిటికిని మీదే భారము.

శా. ఆదిన్ బైరముఖాను పేరవడి చానైయున్న యీ మొక్కకున్
బ్రోదిం గల్పనఁజేసె నా వెనుక మీరు న్మానసింహుండు పెం
పేదన్ సైనిక కార్యఖడ్గముల సద్వృద్ధిన్ బొనం జేసి రీ
పాదు న్నేతుహిమాద్రులంటుకొననీ పైభారము న్మీది గ్యా. 32

అబుల్—పాదుషావారినోట నిట్టిదైన్యోక్తులు వచ్చునంతప్రమాద మేమి సంభవించినది?

చ. చిన్నతనంబునం దుడుకు చేఁతలు చేసిన నట్టియున్నె, ఈ
తెన్నులు పెద్దయౌ కొలఁదిఁ దీఱవె, బాల్యమునందుఁ జెట్టలై
యున్న మనుష్యు లెందఱిల నూర్జితులై మనరే వయస్సు రా
నిన్నటికంటు పీనికయి నీమన మంగునఁ జింత మానుమా. 33

అక్బ—కుమారా! తెలివివచ్చినదా? మేము నేఁడే కార్యాంతరమునఁ బోవుచున్నారము. భవిష్యచ్చక్రవర్తివగుట నీతో నొకసంగతి చెప్పవలసి యున్నది.

సలీం—(లేచి చేతులుకట్టుకొని నిలువఁబడి తలవంచి) బరాబర్; సర్కార్!

అందఱు—జయము. జయము. పరమేశ్వరుఁడు మనపక్షమునఁ గలఁడు.

అక్బ—మిత్రులారా! నేటికి దర్బారు చాలించితిము. సేవకా! అభ్యంతరమందిరమునకు దారిచూపుము.

(నిష్క్రమింపఁగాఁ దెరజారును.)

---

రంగము—రత్నపూర్ కోట.

[దేవిడీమొగుటు సిపాయిలాయుధపాణులయి కావలియుండ లోపలగదిలో నొక మంచముపై రణమల్లుఁడు విశ్రమించియుండును. సమసరాలు మోహినీబాయి యుపచారములు చేయుచుండును.]

రణ—బిడ్డా! పరితాపుఁడింకను రాలేదు. ఉత్తరమందెనో లేదో! నాశరీరస్థితి దినదినము క్షీణదశకు వచ్చుచున్నది.

మోహి—ఏమీ ఇంకనుగడువుకలదే! మొన్న నేగదా నీనువ్రాసిన యుత్తరము నొక శిలీముఖము ముఖంబున నశ్వారూఢుఁడై పోవు నావీరానెత్రిపమున కందఁజేసితి!

రణ—కుమారీ! నాకేయుపాయముఁ దోఁపకున్నది.

గీ. జగము రుజలగోలుగా లేచఁజాల నేను
వైరు లరికట్టి రోయుచుఁ బోవఁగ నిక
తండ్రియే నన్నుఁ గూర్కకుఁ దాల్చ నొంచె
ఎవరు దిక్కింక నిను గాక నేదివెఱపు? 37

మోహి—దాదాజీ! నాకొకయుపాయము తోఁచుచున్నది. కోపగింపరేని మనవి చేయుదు.

రణ—బిడ్డా! నీపయికోపమా! ఎంతపాపముమ్మా! ఆయుపాయమేమి? నిరపాయమేని నవశ్య మవలబింతము.

మోహి—నామూలమునఁగదా యింతచేటు వాటిల్లినది!

ఉ. మానము పోవనున్న మొద మానవతీమణికిన్ స్వకీయమా
ప్రాణము పిమ్మటే యనుచు నటంచును దెల్పిరి నీతికోవిదుల్
మానితకీర్తిసాంద్రయినమా యనుమానము మాను, మింక మ
త్ప్రాణము ధారపోసెదఁ గృపాణముచే నిజమానరక్షకై. 3

రణ—(చెవులుమూసికొని) హర హర! హతోస్మి! హతోస్మి! కుమారీ! ఆఁడుబుద్ధిచే సాహసించెదవు సుమా!

ఉ. పుట్టినకూటిబల్గ మది పోయిన నిన్నుచుండి నే బిగం
బట్టితి ప్రాణ మీంతవఱకున్ నినుఁ బాసిన నాకు లోకమే
కట్టిది సాహసింప నని పల్కుచు చేఁజెయి వైచి, నీకు నా
యొట్టుసుమీ తెగింపకుమి యోతనయా! వినయా! నయాన్వయా!

[అంత నొక యవనయోధుని వేషమున జయసింహుఁడు ప్రవేశించును]

జయ—(తనలో) అక్కటా! అప్పుడే కార్యము మించివచ్చినట్లున్నదే. నేనెంతత్వరితగతి వచ్చినను సమయమున కందఁజాలనైతిఁ గాబోలు.

ఉ. ఎయ్యెడ మ్లేచ్ఛసైన్యచయమే! అరికట్టిరి కోట నప్పుడే!
దయ్యములు పిశాచములు తాండవమాడెను మేడలందు, నా
కయ్యెడ కేగుటెట్లొ? రిపుహస్తములం బడకుండఁ దొయ్యలిన్
చయ్యనఁ గాచుటెట్లొ తగుచందము నెవ్వఁడు దీనిఁ గేలుచేయుదున్?

కాని! ఇప్పటికీవేషముననే కార్యము సాధించెదంగాక. (కొంతదవ్వరిగి) అప్పుడే యర్ధరాత్రము కావచ్చినట్లున్నది. (ఇటునటు పరికించి)

శా. స్కంధావారమదెల్ల మాటుమణిగెన్ గాపున్న సైన్యంబులున్
బందస్తంభములట్లు నిల్చెఁ దురగవ్రాతంబులుం గూర్కెడిన్
గంధేభంబులు శాంతినొందె నిజఘీంకారంబుల న్మాని యిం
కం ధీదర్పము పేర్మి నే నిపుడె దుర్గద్వారముం జేరెదన్. 41

పోనీ ప్రాణిద్వారమునఁ జొచ్చుట కింతకన్న సుగమ్యముగానుండునేమో! (ఆలోచించి) ఛా! అదిపౌరుషశూన్యంబగు నాలోచన.

శా. సద్వంశంబున గొన్న రాజసుతుఁడన్ శౌర్యప్రతాపోజ్జ్వల
ద్విద్వద్వాదితుఁడైన శూరజనుమల్ పృథ్వీశపుత్రుండ, నా
పద్వర్గంబున నున్న వారి వెతఁ దీర్పన్వచ్చి యున్నాఁడ, సిం
హద్వారంబునఁగాక వేఱుగతి డాయంజూతునే భీతినై. 42

(కొంతదూరము నడచి) ఇదిగో! నల్లమద్దులవలె నిచ్చట నిద్దఱు సిద్దీలు తుపాకులు

చంకనూఁదుకొని నిలువఁబడి నిద్దురపోవుచున్నారు. (సమీపించి) ఓరి ముద్దులా
గా! ఇదియేనా మీజాగ్రత్త! కదలరు! మెదలరు! మీ పట్టినిద్ర దప్రతాపు
లే తుదవఱకుఁ గాపున్న నేనొక్కఁడనే కాదు దళములకు దళములనే దింపివే
యవచ్చును. ఇదిగో! ఈముద్దులలో నొకఁడు కదలుచున్నట్లున్నది. సరే! నిద్దు
రమైకముచే వీరిచేతితుపాకులు తమంతనే జారినవి. మొదట వీనిని జాగ్రత్త పె
ట్టవలయును. (తుపాకులుతీసికొని) ఇంక లోనఁ బ్రవేశింతును. అభ్యంతరపర
చెనా నాప్రతాపాగ్నికి వీఁడే ప్రథమాహుతి యగును. (లోనికిపోవుచుండును)

మొదటిసిద్ది—కోణ్ హైరే అద్మి హైగో! హైరో!

జయ—ఫర్వానహీ! దోస్త్ హైఁ! (లోనికిఁబోవుచుండును.)

మొదటి—దోస్త్ నై! నేస్తమ్నై! అరెరేసిద్దిరాం! ఉటో! ఉటో! దగా! దగా!

రెండవసిద్ది—క్యాహై. కడ్ బిడ్ ఖాణే. అద్ధారాత్రిఫారా నీకీ! ఆమీదమాకీ

మొద—అరే! ఉటోరే! బడేకోపం వచ్చాయ్ దగాఖోర్ జులుంసేసి తలాయిం
చూకపోతువున్నాయ్. బిగుల్ పూరూగా దగులాబ్జీ! (జయసింహునితో)
ఆగు! ఆగు! టలాయించూక యెంతదూగం పోతావ్. మాటా సెప్పు.

జయ—ఇదిగో! ఈకత్తి పోగు నీకుమాట.

(ఇరువురు కలియఁబడ నటికి వేసి లోనికిపోవును.)

తుచ్ఛులారా! ఇంక మరెక్కడైన తిరిగి యల్లాగు తలంచుకొనుఁడు. (లోపల
ప్రవేశించి) అదిగో వృద్ధుఁడు మంచముపట్టెను మనుమరాలే కాఁబోలు ఉపచారములు
చేయుచున్నది. అయ్యయో! ఈమె కెంతదుర్దశ పట్టుచున్నది. హా! భ్రాతృద్రోహీ! సా
గరా! ఈసాధుబాధకు నీవే యుత్తరవాదివి సుమా! అక్కటా! చెక్కుగిరిన పాల్కురు
నీసుకుమారశరీరిణి యీమెుగలాయీనా నాకు శోలాయగుటు. అక్కటా! ఈదీను
రాలి ప్రస్తుతరూపమెంతజాలి పుట్టించుచున్నది!

చ. చిటిపొటి మాటలు న్నుసరి చీఁకునెకాదఁ గృశించనీక ని
ష్కళంకములైన చూపు లరిగు ల్వాలిపుచ్చఁగ నెట్లొ మాటి గ్రే
రటులను పొంగినచ్చెను నిజాంగుతరంగము లట్టె యాప్చి మి
క్కుటముగు హేమమూర్తియనఁ గోమలి తాతపదంబులొత్తెడిన్.43

మోహి—దాదాజీ! ఎవ్వరో మనదిక్కునకే వచ్చుచున్నట్లున్నది. వేషము చూడఁ
గాఁ దురుష్కయోధునివలె నున్నాఁడు. ఇఁక నేమి గతి?

రణ—బిడ్డా! భయపడకుము. ఏదీ నాకైదువు?

శా. ఓరీ! మ్లేచ్ఛకులాధమా! నిలువు మీ వృన్నత్తతం జెందినా
వా! రాత్రిం జొఱరా హాపించితివి రాజాంగనాపుంజంబు నీ భా
జ్యారైపోయెనె నీకు, సాగనిజ్జి పుచ్చాంగాలు నిన్నిట్లు; రా
రా! రక్తప్రవహప్రవాహములు పొరింజేతు నీమేనునన్. 44

జయ—అయ్యో! నాయీబహిర్వేషము వీరిని భ్రమింపంజేసినది. వీరబలా వృద్ధులు గదా! నేనెంతబుద్ధిమాలిన వేషము వేసితిని! (తీసివేసి)

చ. తడఁబడఁబోకు మోసుకుమ ధన్యా! నుసుకష్కుడంగాను, నీప్రభుం
జడియకు మోహిభీకప్య రక్షాంబులోఁచక! వచ్చితి బ్రీతా
పుండనుప నేఁడు సింహసపునుక్రోడ, శ్రీజయసింహ సుతుండ, న
ప్పుడె మరపొనె మున్నుగద, పోఁగని బాణములాడఁగొట్టవే 45

మోహి—(చప్పునలేచి చివాలున చాటునకుఁబోయి నిలువఁబడును.)

రణమల్లు—(ఆత్రముతో చేతులుచాఁచి) నాయనా! జయసింహా! వచ్చితివా? ఏమీ నన్నొకక్రమాఱు కౌఁగిలించుకొనుము మ్లేచ్ఛసైన్యముచే నరికట్టఁబడినయీదుర్గము నధరాత్రము నెట్లు చొరఁగలిగితివి? వారిలో నెవ్వరు నడ్డగింప లేదు గదా!

జయ—(దగ్గఱకూర్చుండి) అడ్డగించిన సిక్కుల నిద్దఱఁ బెద్దనిద్దుర పొందించిగనే వచ్చితిని.

రణ—బలే! మంచిపనిచేసితివి.

మోహి—దాదాజీ! వారికళేబరములుపాఱవేయించినఁగాని ప్రమాదము వచ్చునేమో.

రణ—సరే! సేవకుల కాజ్ఞాపింతము.

జయ—(నవ్వి) అబల యగుటచే భయపడుచున్నది.

మోహి—(తలవాంచి) భయముకాదు. పనపనులు గుప్తముగానడపించుట మంచిది కదా!

రణ—జయసింహకుమారా! అటుగాదు.

గీ. బాలయయ్యును గుణబుద్ధిశాలిని సుత
కుడిభుజంబట్లు నాకుఁ దోడ్పడుచును బనుల
నన్నిటికి దీనినే నమ్మి యున్నవాఁడ
దైవచిత్తంబ దెట్టులు తీనరఁగలదో! 46

జయ—రణమల్ల రాజచంద్రమా! ఇంకఁ దమస్వాంతంబున నావంత శావంతేనియుం జోటీయంజనదు.

గీ. భూమితన సర్వసిద్ధి ప్రతాపునకు గలుగు
మేటిశూరుల సామీఁద మేను గలము
మూతిపై మీసకలు నూఁగు మొలచి యుండ
నిసుతి న్నొట్టఁగలఁడె త్రినేత్రుఁడైన. 47

మోహి—(జయసింహునిఁ జూచి సంతోషగర్వము నటించును.)

రణ—అందుకేగదా! ఈవిపత్సమావస్థలో మీసహాయముఁ గోరుట. కుమారా! రాణావారెక్కడ?

జయ—రేపటి నెల్లుట సైన్యసమేతులై యిచ్చటికే వత్తురు.

రణ—నాయనా! చూచితివా మాయవస్థ! నాస్థితి నేఁడో రేపో యనునట్లున్నది, కావున ననితరలభ్యంబులును, అమూల్యంబులు నగు రెండు వస్తువులు మీవశము చేయవలసియున్నది. అంతపర్యంతము నాయంతరాత్మకు శాంతి యుండదు. అత్యంతపవిత్రియు శిశోదియావంశాలంకారయు నగు నీసుకుమార గాత్రి మదీయగారాపుఁబుత్రి మానధనమ్ము బొక్కటి—

మోహి—సిగ్గుచే లోనికిఁ బోఁబోవును.)

రణ—బిడ్డా! సిగ్గేల? ఇట్టిపరిమాదస్థితిలోఁ జెప్పవలసిన సంగతులు చెప్పక మోమోట పడిన లాభమున్నదే! ఆగుము.

మోహి—లోపున చిన్న పనియున్నది. చక్కబెట్టుకొని యిప్పుడే వత్తును. (పోవును.)

రణ—కుమారా! ఇంక రెండవది పరమరహస్యము. (చెవిలోనే మోచెప్పి పక్కక్రింద గుప్తపరచిన యొక పేటికతీసియిచ్చి) అయ్యా! ఇందుఁగలవి గడింపరాని వస్తువులు. మనవా రుదయపురము తిరిగి స్వాధీనము చేసికొనిననాఁడుగాని దీనిఁ దెఱపింపఁ జనదు. అంతవఱకు నిది ప్రతాపుని యాధీనమున నుండవలయును.

జయ—చిత్తము. దీనిని ప్రతాపుని కందఁజేయువఱకుఁ బ్రాణతుల్యముగాఁ గాపాడుటయే నాపనిగాని దీనిలోనున్నవానితో నాకు సంబంధములేదు. దీనిని తెరచువిషయమై తమయుత్తరవులు రాణావారి కెఱిఁగింతు.

మోహి—(తిరిగి ప్రవేశించి) దాదాజీ! కొంచెము పానీయము పుచ్చుకొనకున్న నుదయమునకు నీరసమెచ్చగును. (ఇచ్చును.)

రణ—(పుచ్చుకొని త్రాగి) బిడ్డా ! జయసింహుని జూచినంతనే నాకెక్కడలేని సత్తువయును వచ్చినది. ఇంకను నీరసమెక్కడ ?

మోహి—ఆ ప్రసమాగమ మట్టిదియే. అందులో సామాన్యులుకారు. ఆపద్బాంధవులగు నాప్తులు. వేఱ చెప్పవలయునా !

రణ—కుమారా! జయసింహా! నిన్న నాకొక పాడుకల వచ్చినదోయి ! అది కలగాదు నిజముగా జరిగినదానివలె నిప్పటికిం గన్నులకుం గట్టినట్లున్నది. ఎవరో యొక రసపుత్రస్త్రీయటం మనసన్ని హితబంధువర్గములోనిదేయంట. ఢిల్లీలో జరుగు నారోజాపహారు మాడం బోయినదంట. ఎవండో స్త్రీవేషమున నందుసంచరించు చుండి యామెంజూచి యరికట్టెనంట. ఆమె నయమునను భయమునను వానిబుద్ధి మఱల్పం బ్రయత్నించెనంట. అతండు వినక బలాత్కరింపంజూచెనంట. ఆమె తనయిలువేల్పు కాళీమాతం బ్రార్థించెనంట. దేవి కత్తియిచ్చెనంట. ఆమె కత్తి యెత్తి వానిందెగవేయం బోయెనంట. అంత నాతండామె కాళ్ళపైం బడెనంట. అంతలో కాళీమాత బాణభట్టుగా మాఱిపోయె. ఆ ధూర్తుం డక్బరు పాదు షాయయ్యె. ఆపతివ్రతాశిరోమణి మన కమలాబాయియే. అక్కడ నేనుంటి నంట. ఇక్కడ మాకోట కాలిపోయినదంట. మోహిని యేమయ్యెనోయని నేను మిగుల నారాటముతో బరుగులెత్తుచుంటినంట. ఇంక నే వేవియో యూహింపరాని యసందర్భములు గల కల వచ్చినది.

జయ—మనసు చెదరియుండునపు డిట్టి కలలే వచ్చుచుండును. దీనినిగూర్చి విచారింపక నేటిరే నిశ్చింతగాం బండుకొనుండు.

రణ—సరే! మీరును సుఖనిద్రం జెందుండు.

(తెరజాఱును.)





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము.

## (రాణా ప్రతాపసింగు)

## తృతీయాంకము.

---

### 1. రంగము—ఢిల్లీలో రజపుత్రసామంతులుండు వీథి.

[బాణభట్టు వ్యాకులచిత్తముతోఁ బ్రవేశించును.]

బాణ—(తనలో) ఆహా! కార్పణ్యము! ఈపిశాచ మావేశించిన మానవుం డెంతటి పాపకృత్యములకైన వెనుదీయఁడు గదా.

ఉ. హైన్యపుఁజేఁతలా, వికృతులా, యతులాశ్రిత మిత్రఘాతలా,
శూన్యపుజిత్తులా, యపరిశుద్ధప్రవృత్తుల, జీవహత్యలా,
కన్యలపాట్లు, కాఁపురపుఘాతల, తా నెదిచేయలేదు! కా
ర్పణ్యముఁ గొన్న చిత్తమపురా! తలపోయునె పుణ్యపాపముల్.

పాపము! మాప్రతాపుఁ డెప్పుడో యీమానసింగునకు పంక్తిభోజన మీయలేదఁట. ఆ పగ మదినుంచుకొని యిప్పుడాతని కుటుంబమున కీనీచుఁ డెంతటి యుపద్రవమును జేయ సంకల్పించుకొని యున్నాఁడు. ప్రతాపుని సోదరియు పృథ్వీరాజు భార్యయు నగు కమలాబాయికి రాఁబోవు నౌరోజా బహారులో మానభంగము చేయింపఁ బాదిషాను బురికొల్పి కార్యాంతరవ్యాజమున నామెభర్తయగు పృథ్వీరాజును బట్టణమునుండి పైకంపి, తాను రత్నపూరుపై దాడివెడలి ప్రతాపభ్రాత సాగరజీ పుత్రి మోహినీబాయిని మొగలాయీజనానాకుఁ బంపుటకై భగీరథప్రయత్నములు చేయుచున్నాఁడు. జ్యేష్ఠుండగు సలీమును గులామును గావించి తన భాగినేయుఁడగు ఖుస్రూకు రాజ్య

మిప్పించవలయునని చేయరానిపనులు చేయుచుఁ బడరాని కడగండ్లం బడుచున్న వాఁడు. పైకార్యసాధనోపాయము నిజభుజబల బుద్ధిబలంబుల కతీతంబగుటచేతఁ గాఁబోలు చంద్రికళయను నొక సానిదాని కాస చూపించి దానిచే నెన్నియో యకార్యములను గావించు చున్నవాఁడు. అదిగదిగో! చంద్రికళయే గాఁబోలు మానసింహుని మందిరం బుననుండి వచ్చుచున్నది. నిన్న సాముద్రికవ్యాజంబున దీనినోట్టినుండి కొన్ని రహస్యము లను వెడలఁగ్రక్కించితిని గదా! మంచిమాటలాడి నేఁడు మిగిలినవాని నూడఁ దీయ వలయును.

[అంత చంద్రికళ మానసింహుని మందిరమునుండి ప్రవేశించును.]

చంద్రి—ఓహో! సాధూజీ! ఇక్కడనే యున్నారా?

బాణ—ఆ! ఇక్కడకేవచ్చినారము. రాజామానసింగు లోపలనున్నాఁడా?

చంద్రి—ఆ! ఉన్నారు. నిన్ననే రత్నపూరునుండి వచ్చినారు.

బాణ—రత్నపూర్ మోహిని వచ్చినదా? ముసలిరణమల్లుఁ డెట్లున్నాఁడు?

చంద్రి—పాపము. రణమల్లుఁడు గతించేనఁట. మోహిని యింకనురాలేదు.

బాణ—(తనలో రిచ్చపడి పైకి) సరే! నేఁడు కాకున్న రేపుజరుగవలసినదే. నారోజా లో కమలాబాయి విషయమగు నుద్యమము మానుపించు ప్రయత్నము లేమైనఁ జేసితివా?

చంద్రి—చేసితిఁ గాని కార్యములేదు. ఆవిప సప్పుడే ఫాదుసా తలకెక్కినది. ఇఁక దింపుట కష్టసాధ్యము.

బాణ—సరే! పశ్చాత్తాపమే పర్యవసానము. రేపే గాఁబోలు కుష్‌రోజు. నీ వాపని మీఁదనే వారియింటికిఁ బోవుచున్నా వనుకొందును. పొమ్ము. పొమ్ము. విశేష దోహదము చేసితివా నీకొంప మునుఁగు. జాగ్రత్త.

చంద్రి—అయ్యో! నిజమునకు నాకేపని యిష్టములేదు. ఏమిచేయను! వారు ప్రభువు లు. కాని స్వామీ! నాహస్తబలము పూర్తిగా సెలవిచ్చినారు కారు. కమలా బాయిగారియొద్దకుఁబోయి తిరుగుఁ దలలో పురల తదర్శనము చేసికొందును. తమ రీప్రాంతముననే కదా యుందురు.

బాణ—నీహస్తబలము బహుప్రశస్తముగానే యున్నది. సావకాశముగా చూడవల యును. మంచిది పోయిరమ్ము.

(నిష్క్రమింపఁ దొరఁగజారును.)



## 2. రంగము—పృథ్వీరాజు మందిరము.

[కమలాబాయి విశ్రమించియుండును.]

కమలా—(తనలో) నేఁడే కాఁబోలు నవ్రోజు పండుగ. అందులకు స్త్రీలే యుందురఁట. దేశములో లేనివస్తువుల నెల్ల తీసికొనివచ్చి విక్రయింతురఁట. ఒకమాఱు పోయి చూచినం దప్పేమి? ఇంతకు భర్తగారి యనుజ్ఞ గైకొంటిని. బాణకవి మునలిపిచ్చచే లేనిపోని యనుమానములు పెట్టును. ఆ యనుమానముల కంతగా నాధారము కానరాదు. అదిగో బాణకవియే మరల వచ్చుచున్నాఁడు.

బాణ—(ప్రవేశించి) అమ్మా! చివరకుఁ బోవుటకే నిశ్చయించినారా?

కమలా—ఆ! అక్కడ తిరిగి రెండుగడియలలో వత్తును.

బాణ—సరే! మీచిత్తము. ఏదేని నవసరము తటస్థించినపుడు మనయిలువేల్పు మృగేంద్రవాహనను బ్రార్థింపుఁడు. గుప్తఖడ్గము మఱువకుఁడు.

కమలా—మంచిది. మీయుపదేశము శిరసావహించెదను.

బాణ—దేవి మిమ్ము రక్షించుఁగాక. నాకు సెలవు. (నిష్క్రమించును.)

[చంద్రికళ ప్రవేశించును.]

చంద్రి—అమ్మా! సవారీసిద్ధమయి చాలసేపయినది. ఇంక నాలస్యమేల? మనము తిరిగి వేగముగా రావలయునుగదా!

కమలా—ఇదే వచ్చుచున్నాను. (ఇరువురు గలిసిపోఁగాఁ దెరవాలును.)

బాణ—(వెకివచ్చి) సరే! మీరు వెడలినారు. ప్రచ్ఛన్నమున వీరిని వెంబడింపవలయును. స్త్రీలకుఁగాని ప్రవేశములేదఁట. మంచిది. ఆలోచించెదను. (పోవును.)



## 3. రంగము—అంతఃపురములో మహాలు. మహాలులో నొకగది.

చంద్రి—అమ్మా! ఈయంగడిలో చిత్రవిచిత్రములైన సరకులు ముద్దినుసు వస్తువులు, నగలు, నాణెములు, జరీచీరెలు, బుటేపరికిణీలు సమస్తము గలవు. రండు. ఎవరమ్మా ఈయంగడిలో? తలుపుతీయుండండి.

[స్త్రీవేషమునున్న యక్బరు తలుపుతీసి చంద్రికళను పొమ్మని సైగచేయును.]

చంద్రి—అమ్మా! మీరిక్కడనే బేరము చేయుచుండుఁడు. ఇదే పొరుగంగడికి నేఁ బోయి యొకవస్తువు ఖరీదుచేసికొని చిటికలో వత్తును.

కమలా—చంద్రికళా! ఉండుము. నా కిది క్రొత్తస్థలము.

స్త్రీ—అమ్మగారూ! భయమూలేదండి. లోనికీదయచేయండి. వచ్చికూర్చోండి. మీరు కోరినవస్తువు తీసికొనివచ్చి యిస్తా.

కమలా—ఇది స్త్రీకంఠమువలె లేదు. మోసమాయేమి చెపుమా!

అక్బరు—(స్త్రీవేషముతీసివైచి నిజరూపముతో) కమలా! ఇఁక దాఁపనేల? నే నక్బరును. నీదయఁగోరియున్నాఁడను. చేసినమోసము క్షమింపుము.

కమలా—(విస్మయస్తబ్ధయై కొంతవడి మాటాడనేరకుండును.)

అక్బరు—సుందరీ! నీముఖచంద్రబింబమునుండి మందహాసచంద్రికలం బఱచి నా నయనచకోరములకు విందుచేయుము.

కమలా—(చెదరినహృదయము కుదురుపఱుచుకొని తనలో) దైవసమానుఁడగు బాణకవి చెప్పినమాట యేల పొరపాటుగు! ఆఁడుబుద్ధిచే సాహసించి యాపదలఁ దెచ్చికొంటిని. కానిమ్ము. ధైర్యమవలంబింపవలయునుగాని మించినదాని గుఱించి విచారించుచుండిన లాభములేదు. సరే! చిత్తూరురసపుత్రికల చిత్తములెంతమెత్తనివో నేఁడీయక్బరుషాదుషా యెఱింగెడింగాక (పైకి) సార్వభౌమా! ఇట్టి మోసముచేయుటలో నీయుద్దేశమేమి?

అక్బరు—నాయుద్దేశము నానోటనే చెప్పింపవలయునా? నీకొఱకే, నిన్నుఁగోరియే!

కమలా—ఓహో! అలాగునవా? నీస్థితి చూడ నాకు మిక్కిలి జాలి కలుగుచున్నది.

ఉ. పుట్టినదా తలంప మఱి పుట్టువు, వంశము తానసూర్యమై
నెట్టన రాజమౌక్తిక మణిప్రజ మీను మొగల్ కులంబు, చే
పట్టినదా యఖండమగు భారత రాజ్యరమాసు రాంగి సీ!
యెట్టుల వేసికోయి! కడుహీనము నీయుది యాఁడువేసముల్. 49

అక్బరు—సుందరీ! మీ స్త్రీజాతిని గౌరవించుటకే నే నీవేషమువేసితిని. దానికేమి? ఏవీ? నీకొఱకై వేసిన నా యీవేషమును బహూకరింపుము. రమ్ము. ముద్దిమ్ము.

కమలా—ముద్దా కావలయును? అయ్యో! మీరు పెద్దలు. భారతభూచక్రము నెల్ల నేకచ్ఛత్రాధిపత్యమున నింతదనుక మిగుల ప్రజారంజకముగా నేలుచున్న చక్రవర్తులు. నే నాఁడుదాన. విశేషించి మగవాల. ఇట్లుగ చాట్లఁబెట్టుట తగవుగాదు. ఇంతకు నిది వృథాశ్రమ! నన్నేల కష్టనిష్ఠురముల పాలుచేసెదరు?

అక్బరు—కష్టమా! నిష్ఠురమా! బాలా నీవెంతబేలవు?

చ. ఎఱుఁగవు గాక నీసిరి ఫలించియె గాదె సమస్త భారతే
శ్వరుఁడు తనంతఁ దావలచె, ప్రియపుటాసుని నిండుజవ్వనం

బఱిగిన క్రిమ్మరం బొసఁగనౌనె సృజించిన బ్రహ్మకైన నీ
బిరుసువచాలుమాని పదవే ముదమందఁగఁ బాముపాయొడీ.

కమలా—ఆర్యా! మూర్ధాభిషిక్తుండవగు నీనోట నిట్టిమాటలు వచ్చుటయు నే విని సహించుటయు నెంతకష్టముగా నుండును !

అక్బరు—ఏమీ! నామాటలు నీకుఁ గష్టముగా నున్నవా ?

చ. గరళము త్రావ్రునుంటినె దిగంబరునుంటినె నిప్పునుంటగోఁ
గఱఁగొని యేపితో మెడకుఁ గట్టితినో పెనుగండగత్తెఱ.
పరువపుజాణవౌనన్న సెబాసనవచ్చును పామసాహెరీ
హరువగుచేతి గాఁజినకవై నుదమొందుట గూడ కష్టమే.

ఓరమణీశిరోమణీ ! ఏరాజరాజేశ్వరుని కీర్తి డిండీరములు పూర్వాపరజలధిపరివలయిత మహామహీతలంబున పోటుపాటులు లేక నిరంతరము నాట్యమాడుచుండునో, ఏజగజ్జేతచేత నిలుపఁబడిన విజయపతాకావితానంబులు శీతాచలరత్నసానువులమీఁదను మేరుమహీధరపు గాలిగోపురములమీఁదను నెగురుచుండునో, ఏవసుంధరాధీశ్వరుండు స్వకీయరాజకీయ ప్రతిభాకౌశల్యముచే హిందూమహమ్మదీయ బృందముల స్వమత వైషమ్యముల నిమేషమాత్రములో నదృశ్యముఁజేసి రెండు తెఱంగులవారిని రెండుకన్నులుగాఁ జూచుచు నుభయుల మన్ననలకుఁ బాత్రుఁడగుచున్నాఁడో, ఏసర్వసర్వంసహాధీశ్వరుండు తన మహదైశ్వర్యసంపదచే శర్వుం దృణీకరింపఁజాలియు నిగర్వచూడామణియై మెలంగుచున్నాఁడో అట్టి భారతసార్వభౌముండు, హిందూస్థానమహాసామ్రాజ్యలక్ష్మీ మనోనాయకుండు, అక్బరుచక్రవర్తి నీచెట్టఁబట్టి నీ సేవఁజేయు మహాభాగ్యము దయచేయుమని యనిర్వచనీయ ప్రేమపూర్వకంబుగా నిన్ను, శిశోదియావంశభూషణమవగు నిన్ను, చిత్తూరువంశక్షీరపారావార కమలాలయవగు నిన్ను ప్రార్థించుచున్నవాఁడు!

కమలా—అయ్యా! స్వోత్కర్షమై దీర్ఘోపన్యాసముచేసి యెంతయు నలసియున్నాఁడవు. ఇఁక నామాటయువినుము. ఏవంశమునం దాణిముత్తెములంబోలు పతివ్రతాశిరోమణులును, అభిమన్యకల్పులగు యోధానుయోధులును, కుంతీదేవికెనయగు వీరమాతలును, జనియించుచున్నారో, ఏరాజపుత్రశాఖ నేటిదాఁక తురుష్కసంపర్క కళంక దూరంబయియున్నదో, ఏరాట్కులమను రత్నాకరము స్వకీయమానసంరక్షణకై నిజప్రాణమైన తృణప్రాయముగా విసర్జించు

టకు లేశమాత్రమైన వెనుదీయని పతివ్రతాశిరోరత్నముల కాకరంబో, అట్టి శిశోదియావంశమునఁ బుట్టిన కమలాబాయి, అమిత ప్రతాపతేజఃపుంజమగు ప్రతాపసింహరాణావారి తోఁబుట్టువగు కమలాబాయి, నేఁడు ప్రమాదవశమున నీసామంతులలో నొకరుగానుండఁదటస్థించిన పృథ్వీరాట్ సత్కళత్రమగు కమలాబాయి, అమాయికలోకమునెల్ల నిటులనే వంచించుచు మంచివాఁడ ననిపించుకొనఁ బ్రయత్నించు మేకవన్నెపులివగు నీకు, సార్వభౌముఁడవగుటచే స్వకీయాదర్శనమున సమస్తప్రజలను సన్మార్గమున నడపించు నుత్కృష్టబాధ్యత గల నీకు, సంసారసుఖసారమునెల్ల నిరవశేషంబుగా ననుభవించి విసిగి వేసారి నీయంత తనయులను మనుమలను కనిన నీకు, ఇట్టి తుచ్ఛపు, హేయపు, నీచపు, గోర్కెతగదనియు అందునకుఁ దానెంతమాత్ర మంగీకరింపఁజాలదనియుఁ త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నయది.

అక్బరు—(తనలో) ఏమీ! సమస్తభారతోర్వీ సార్వభౌముండనగు నాతోడనే యింత నిర్భయముగా, ఇంతనిర్లక్ష్యముగా, ఇంతకచ్చితముగాఁ జెప్పుటకీమె కింత ధైర్యమెచ్చటినుండివచ్చినదో! ఆహా! అది వీరి చిత్తూరునీరసుట్టి సారము. ఆహా! భరతఖండమా! మేల్మేలు! నీక్షేత్రసారమెంతస్తోత్రపాత్రము! సరే! ఇది ప్రశంసలకుం దగినయదను కాదు. అఁగు దానిచే నిట్టి మాటమాటలు పడి మిన్నకుండినచో నిఁక నన్ను గణించువాఁ డెవ్వఁడు? ఎట్టయిన పట్టినపట్టు విడిచిపెట్టక వాకట్టి యీమె చెట్టఁబట్టఁ బ్రయత్నింపవలయును. (పైకి) సుందరీ! ఏమనుచున్నావు? నాదిహేయపు, తుచ్ఛపు, నీచపుఁగోర్కెయా! నీదేమో పవిత్రపు, పరిశుద్ధపు, పారమార్థికపు వంగడమా? అవును. ఆత్మస్తుతియుఁ బరనిందము నగ్గుతో రంగరించి పోసినవియేగదా మీవంగడంపు నంగనాములకు. దానికేమిలే నీవు చెప్పినట్లు నాకోర్కె తుచ్ఛమో స్వచ్ఛమో హేయమో శ్రేయమో యెట్టిదైన నగుగాక. నీవిప్పుడు దానికంగీకరింపక తప్పదు. వృథా ప్రయత్నములు మాని—

ఉ బల్పపు తూలగోడలును భాసురమేడలు హంసతూలికా
తల్పములున్ సుస్థసుశితారమరీచులు రత్నదీపికా
శిల్పరుచిన్ హసింపఁగ వశీకృత మన్మథరాజ్యలక్ష్మివై
మెల్పున నొప్పుసుం జెనఁగుమీ! తగుమీరా మొగమోటమేటికిన్.

కమలా—ఓహో! ఏమాసంపత్తి! హంసతూలికాతల్పములంట! రత్నదీపికలంట! తాళ హారములంట! ఎంత వెఱ్ఱివాఁడవయ్యా నీవు! ఎన్నఁడు నెఱుంగని గర్భదాసికిఁ జెప్పినట్లు చెప్పుచున్నాఁడవు!

అక్బరు—అయ్యో! నీ వాగర్భశ్రీమంతురాలవే యగుదువు. పాపము! జయపూర్, బిక్కనీర్, జోధ్పూర్ రాట్కుమారికలు గర్భదాసీలగుటనే కాఁబోలు మా జనానా యందున్నారు. లేక వారికి నీపాటి చదువుసాములు రావో!

కమలా—రాకేమి? నాకన్నమిన్న గానే వచ్చును. అందుచేతనే చదువుసాములయందు దమకు సమానఫుఁ జేయివనఁదగు నీగరడీయందుఁ జేరుచున్నారు. ఇంతకు శీలము సాంప్రదాయమునుబట్టి యుండును.

అక్బరు—ఏమీ! వారిసాంప్రదాయ ప్రతిష్ఠలకన్న మీవంశప్రతిష్ఠ లుత్కృష్టతర మైనవియా?

కమలా—ఏమో! ఎవరివంశప్రతిష్ఠలు వారివి. మంచిచెడ్డలు కాకులవలె లోకులు చెప్పుకొనుచునేయుందురు. ఇంతకును నీవిపుడుచెప్పినట్లు నేను జయపూర్, జోధ్పూర్ బికనీర్ రాట్కుమారికలంత దర్జాగలదానను గాను, అంత జాణనుగాను! ఎంగుకు నన్నుఁ రేఁపెదవు?

సీ. నీమాయమాటలన్నియు నమ్మి చెడిపోవ
　　బికనీరు రాట్కుమారికను గాను,
సీడాబుదర్పముల్ నిజ మనుకొని లొంగి
　　పో మానసింగు తోఁబుట్టు గాను,
నీబెదరింపుఁ బన్నికల లోనైపోవ
　　జోధ్పురాధీశ్వరు సుతనుగాను,
మానాభిమానముల్ పోనాడి నిను గూడ
　　రైసింగు లబ్ధపు రమణిఁ గాను,
గీ. మానరక్షణకై నిజప్రాణ మైనఁ
దృణగతిన్ వీడ వెనుదీని ధీరతర శి
శోదియావంశభూషణమై దనరుచు
వెలయు చిత్తూరువిభు నింటి బిడ్డ నేను.

అక్బరు—ఓహోహో! చెప్పితివిగావు మీవంశప్రతిష్ఠ. నీమాటకుఁ దగినట్టులే ప్రత్యుత్తరమీయవలసివచ్చిన యెడల,

సీ. కమనీయరత్నములఁ గనులలోఁ దాఁచిన
రజతాద్రి మకుట మేరమణి వాల్చు
భూరిసింధుబ్రహ్మపుత్రా సరిద్రత్న
భుజకీర్తు లేబాహువులఁ దనర్చు
చారుభాగీరథి తారహారమరీచు
లేయురస్థలమున నింపు నింపు
వలెవాటు వలెనున్న బర్హాంశుకాగ్రమే
కౌమ పయోధరమహీధ్రముల మూఁగు
గీ. ఇట్టి భారత భూకాంతయే మదీయ
పాణిఁ గొని దేహళీపురవక్షమందు
నొప్పుచు నమూల్యభద్రాసనోత్తమమున
నిలిపె నీ వెంత, నీకున్న నీమ మెంత! 54

కావున నోవగలాఁడీ! ఇఁక శెట్టు సేయక పట్టుఁదలమాని నన్ను చేపట్టి నామన్ననలందుము. ఇంతకువచ్చిన తరువాత నూరకుండుట కక్బరంతచేతఁగానివాఁడు కాఁడు. నీవో కృతవే మాటకారివియుఁగావు. చూచితివామాటకు మాట తెగులు! ఏలవాగ్వ్రియము?

కమల—అయ్యా! నాభర్త నీకు సామంతుఁడనియు, మేము నీరాజధానిలో నుంటిమనియు, సార్వభౌముండవగుటచే సర్వాధికారములు నీచేతఁగలవనియు గర్వింపకుము. నిజము. సమస్తభారతీయులకు నీవే యిప్పు డధికారివి. కాని నీమీఁది యధికారి దైవమున్నాఁడు. అతఁడు మనుష్యుల పుణ్యపాపము లనునిత్యము వేయికన్నులతో పరిశీలించుచుండును. ఓయీ! నీయీపాపకార్యముల కాసర్వేశ్వరునియెదుట నేఁడు గాకున్న రేపు విమర్శింపఁబడక తప్పదు. ఇప్పుడు లోకులకన్ను బ్రామినట్లప్పుడు పరమేశ్వరుని కన్ను బ్రామి లేశమైన మభ్యపరచగలవా? ఎంతమాత్రము మభ్యపరచలేవు! చేసినతప్పొప్పుకొనకతప్పదు. అప్పుడుగదా చూడవలెను ఢిల్లీపాదుషావారిస్థితి! నోటమాటరాదు. ఒడలు కంపింపనారంభించును. తల దిమ్మెత్తును. కనులనుండి సంతతధారగా నశ్రుబిందు

వులు గాలుచుండును. సిగ్గుచే మోమెత్తి నలువురి మొగములు జూడఁజాలరు?

అక్బరు—కమలా! ఈమెట్టవేదాంతములతో నాకిప్పుడు పనిలేదు. ముమ్మాటికిఁ జెప్పుచున్నాను విను. చప్పున నొప్పుకొననిచో బలాత్కరింపవలసి వచ్చును.

కమలా—ఏమేమి బలిమిచేతఁ బట్టెదవా? నీపదవిని నీవయస్సును ఆలోచించుకొని వెండియు సిగ్గుపడుము. పవిత్రశిశోదియావంశసంజాత నీతిమాలిన నీ బెదరింపులను నదలింపులను నించుకేనియు సరకుసేయదు. ఏమి! పశుబలమున నాదు మానభంగముచేయుదువా?

ఉ. ప్రాణము గొందువా యొడలిపై పొటుఁజీల్తువ ప్రాణముండఁగా
మేనునఁ గీలుకీలునకు మేకులు దింతువ కేల నాపముం
బూనుచుఁ గాలుసేతులును మొండెముఁ జెండుదువా యొనర్పు మే
ల్లేనియు మానభంగ మొనరింపఁగ నీతరమా దురూహకా! 55

నీవెప్పుడును స్వచ్ఛతరశిశోదియావంశ సంజాతయగు మేవారు రసపుత్రకాంతశుద్ధాంతరంగము పరిశోధించియుండలేదు. శాంతస్వాంతుండవై తల్లక్షణములు వినుము. ఏదీ! నీచేతను చంద్రహాసమున్నదా!

సీ. ఖండింపు మీరెండు కరములు ముంజేతు
లూడ మోచేతు లల్లాడుచుండు
కమల తా నప్పుడైనఁ గదలదు మెదలదు
దుఃఖింప దించుక తొట్రుపడదు
ఇఁక నొక్కమాట నే నిటనిల్తు ఆపము
తెమ్ము తెచ్చియు శరీరమ్మురుగడ
నెడకోఁత పెడకోఁత లిడికోయఁదొడఁగుప
టుత్వంబు సడలు నిస్సత్వమొదవు
కంఠనాళముల రక్తము జుమ్ముమని చిమ్మ
చిమ్మనగ్రోవి నీర్ చిమ్మునట్లు
అప్పుడేనియుఁ గమల నీయడుగులఁబడి
యడుగు మిది సైపనోప నంచడుగఁబోదు

అడిగెనేసిఁ దాను శిశోదియాన్వయంపు
క్షత్రియకుమారి కాదు తార్కాణమిదియె ! 56

ఇంతయేల? తమ తమ భర్తలసంగరరంగంబుల కనిపి వారివిజయముంగూర్చి యనుమానము కలిగిన వెనువెంటనే పవిత్రలగు రసపుత్రశుద్ధాంతఃపురకాంత లెంతమంది నిర్భయముగా, నిర్లక్ష్యముగా, భగభగ మండుచున్న యగ్నికుండములంబడి తమ ప్రాణములఁ దృణప్రాయముగా నాహుతిచేసి యతిపవిత్రంబగు జహరవ్రత మాచరించి నిజమానరక్షణము చేసికొనుటంగూర్చి నీవు వినలేదు. నేను నట్టివంగడంబునఁ బుట్టినదాననే సుమీ!

అక్బరు—ఓసీ బేలా! ఇవియన్నియు నే నెఱుంగని సంగతులు కావు. నీవును నన్నెఱుంగనిదానవు కావు. కావున నిఁక నెందుకు సందియము. ఇదిగో యీసొరంగమార్గమున మన యంతఃపురమునకుఁ బోవుదముగమ్ము. ఇఁక జాలముచేసితివా నేఁడు బలాత్కారము తప్పదు.

కమలా—ఏమీ! నీ మొఱకుఁదనము. ఇంతచెప్పినను నన్ను సామాన్యస్త్రీవలె నూహించి బలాత్కరింతునని భయపెట్టుచున్నావే. పొరపాటు. నాతండ్రి వీరవర్యుఁడు; నాతల్లి వీరమాత! నేనో వీరకాంతను. నీచేతభంగపడి యూరకుండుట కంత మొక్కవోయిన వంగడము కాదు మాది. కావున నామాటవినుము. ఇప్పటికి మహమ్మదీయచక్రవర్తులలో నెల్ల మిగుల మంచివాఁడవని పేరు సంపాదించియున్నాఁడవు. నీతాతముత్తాతలకన్న నుత్తమతర నీతికోవిదుఁడవనియు ధర్మమూర్తివనియుఁ బ్రఖ్యాతిపొందినాఁడవు. సామాన్యమానవుఁ డెవ్వఁడేనియు నిట్టి యసత్కార్యములు చేసినచో నది లెక్కలోనికి రాదు. నీవు సామాన్యుఁడవు కావు. ఒకదేశపుఁ జక్రవర్తివి. ప్రపంచకమునందన్ని దిక్కులనుండియు లెక్కకు మిక్కిలియగు కన్నులు నిరంతరము నీదిక్కునఁ జూచుచున్నవి. నీనోటవచ్చుమాట, నీనడచెడి నడక, నీచేయుపని, వేయేల బాహ్యాంతరములగు నీకార్యము లన్నియుఁ జరిత్రకారులు తమ తమ లేఖినులచే లిఖించి శాశ్వతధ్రువములుగాఁ జేయుచుందురు. నీవు గతించినను నీచరిత్రము మాత్రము గతింపదు. ఇట్టిదౌర్జన్యముల కొడిగట్టిన నీజీవితచరిత్ర మెంత తేలికయైపోవును! ఎట్టి పరిహాసములకు పాల్పడుదువు! నీసొమ్ముఁ దినుచుండుటచే మహమ్మదీయ చరిత్రకారు లిట్టి నీలోపములనే గుణములుగా ప్రశంసింతు రనుకొందువేమో? నిజము నిలుకడపై బయలుపడకతప్పదు. ఓ భారతసార్వభౌమా! నీకీర్తికొఱకు, దేశముకొఱకు, ప్రజలకొఱకు నిన్ను బ్రతిమాలుకొందును. నామాటవిని, నన్ను

మన్నించి, నాహితములను చెవియొగ్గి, నీహితముకోరి, నీవంశహితముకోరి, నీసంతతి హితముకోరి, ఇట్టి హేయపు, హీనపు, తుచ్ఛపుఁగోర్కె నిప్పటికైనను విడిచి బుద్ధిదెచ్చికొనుము. నీదారిం జనుము. ననుఁ బోనిమ్ము. దారిలో లెమ్ము. (పోవుచుండును)

అక్బరు—(దారికడ్డముగావచ్చి) సుందరీ! ఈనౌరోజామహములో నాకిట్టి మచ్చరానే వచ్చినది. ఇఁక నిన్ను విడిచిపెట్టువాఁడను కాను. ఆగుము (అరికట్టును.)

కమలా—ధూర్తా! తొలఁగుము. నీకట్టికోర్కె లుండిన వేఱొకరితోఁ దీర్చికొనుము.

ఉ. నందలు వేలునుందురు సెబాసని నిన్వలపించువారు న
న్నెందుకు బాధపెట్టెదవు; సిసిరి రాజ్యముఁ జూచి యూఁకు వా
రెందఱు? నీకుఁ గాంత లరుదే, పరకాంత నను న్గలంప కో
మందమతీ! నశించెదసుమా వినుమా వనితార్తి సోఁకినన్. 57

అక్బరు—ఓ. యిట్టి శ్రీరంగనీతులు నేను నెఱుంగుదును. (వినిపించుకొనక ఎదుటకు వచ్చి కొంగుపట్టుకొనును.)

కమలా—(తప్పించుకొని పెనఁగులాడి దూరముగా నిలిచి) హా! భక్తవత్సలా! దీనజనమాన సంరక్షిణీ! కాత్యాయనీ!

పాదప. హైమవతీ! మగనాలను దీనన్
దానవశార్దూలు కన్నులు గప్పన్
పామరుఁ డక్బరు బల్మినిఁ బట్టన్
గా మదినెంచెదు గావుము దేవీ!. 58

అక్బరు—నీదయ్యములు, సైతానులు ఢిల్లీశ్వరు నాపనేరవు. (పట్టుకొనఁబోవును.)

కమలా—క. ఏను పతివ్రత నేనిన్
నా నాథుఁడె దైవమని మనంబున నెపుడున్
నే నిష్ఠఁగొలుతు నేనియు
నీనీచుం డిపుడు శక్తిహీనుం డగుతన్. 59

(సారంగములోనుండి శక్తి ప్రత్యక్షమగును. అందఱు స్తబ్ధులగుదురు. అక్బరు మూర్ఛపడి యుండును.)

శక్తి—పుత్రీ! ఇదే యసిపుత్రిక. దీనిచే భవన్మానసంరక్షణము కావించుకొనుము. (కత్తియిచ్చును.)

కమలా—(త్రుచ్చుకొని వీరావేశముతో) ధూర్తా! ఇఁకనైన బుద్ధి తెచ్చుకొని తొలఁగి పొమ్ము. లేనిచో నాకత్తి నీకుత్తుక నుత్తరింపఁగలదు.

అక్బ—(తనలో) ఆహా! ధర్మమునకు దర్పమునకు నిదియేగదా వాసి! (పైకి)

ఉ. దర్పముచే నసాధ్యరిపు దండము గెల్చిన నేనుఁ గోరఁగాఁ
గూర్పఁగరాని దేజి యస్రక్రొవ్వి మదించుచున్న నాకిటుల్
నేర్పితివో సతీ! మఱువనేరని పాఠము; ధర్మవేదినన్
దర్పమొనర్ప లేదెదియుఁ దథ్యము, తథ్యము, తథ్యమిద్దియే. 60

సతీతిలకమా! క్షమింపుము! ఇదిమొదలు నీవునాకు సోదరివి. ఒక్కనీవేకావు. మీశిశోదియావంశసంజాతలగు రసపుత్రికా శిరోమణులందఱు నాకుఁదోఁబుట్టువులే. మీవంశపవిత్రతను బరిశోధించుటకే నేనిట్టి పనిచేసితిని. ఈచిడిముడి నీకడుపులోఁ బెట్టుకొనక నన్ను మన్నింపుము. (తెరజాఱును.)



## 6. రంగము—ఢిల్లీనుండి యుదయపురమునకు వచ్చుమార్గము.

[కమలాబాయియును బాణభట్టును బ్రవేశింతురు.]

కమలా—ఆర్యా! నేనీయుదయపురములో నాలుగుపూటలాగదను. ఇప్పటిలో వారిమొగము చూడఁజాలను.

బాణ—దేవీ! ఏమిట్లు సంకోచింతురు! విజయగర్వముతో మీరుభర్తగారిసందర్శనము చేయవచ్చును. రాణావారును ఈవృత్తాంతము విన్నచోఁ దమసోదరి నభినందింతురుగాని నిందింపరు. సమస్తభారతసార్వభౌముండగు నక్బరంతవానిఁ దృణీకరించి క్షణములో మంచిదారికిఁ దీసికొనిరా మీకుఁగాక మఱియెవ్వరికిఁదగును!

కమలా—ఆర్యా! లోకులు కాకులవంటివారు. వారికీలోపలి సమాచారమంతయు నెట్లుగోచరంబగు!

బాణ—గోచరముకాకేమి? ఒకవేళ నీలివార్తలు గాలిలో వ్యాపించినను నిజము నిలుకడపై బయలుపడక తప్పదు.

కమలా—అందుకొఱకే నాలుగుదినము లిక్కడనాగెదనంటిని. మీరుమాత్ర మీద్రవ్యమెట్లయినను వారికందఁజేయవలయును. నాసొత్తని చెప్పిన మాయన్నగారు పరిగ్రహింపరు. స్త్రీధనము! అందులో పుట్టినింటియాఁడుబిడ్డవిత్తము! కావున మీరు వేఱొకరిదని చెప్పుఁడు.

బాణ—చిత్తము. కాని మీ రీపట్టణమున నెక్కడబసచేయుదురు?

కమలా—రాజనగరునకుఁబోను. ప్రచ్ఛన్నమున నుందును.

బాణ—చిత్తము. ఒకవేళ మోహినీబాయిని సాగరజీప్రభృతు లిచ్చటికిఁ దీసికొని వచ్చినయెడల నామెవిషయమై కొంచెము కనుఁగలిగియుండఁగోరెద. చంద్రికళ యిక్కడనే యున్నదఁట. సాగరజీ దానిని బెండ్లిచేసికొనునఁట. చూచుచుండుఁడు! విని కని యెఱుఁగని విడ్డూరములు మనయుదయపురములో త్వరలో జరుగనున్నవి.

కమలా—సరే! నేనును వానినారయుచుందును. అగత్యమైన తత్క్షణమే మీకెఱిఁగించుచుందును.



4. రంగము—కుటుంబముతో ప్రతాపుఁడుండు గుహాముఖము.

[ప్రతాపపృథ్వీరాయ లొకచెట్టునీడను బండరాతిగద్దెపై విశ్రమించి యుందురు.]

పృథ్వీ—ఆశ్చర్యము! రాణావారిముఖమునం దెన్నఁడు లేని విచారము ద్యోతకమగుచున్నది!

ప్రతా—ఆర్యా పృథ్వీరాయా!

ఉ. జంకును గొంకులేని పటుశౌర్యధనుల్ రసపుత్రులే నిరా
తంకముగాఁ దురుష్కరచితంబగు సంకిలిన్ సువర్ణపుఁ
గంకణమట్లు దాలిచి సుఖంబున నింతయుఁ గుల్కుచుండఁగాఁ
గంకణముల్ కనుంగొనఁగఁ గాల్లను గట్టనె కీర్తికామికిన్. 61

పృథ్వీ—ప్రభుచంద్ర! నేనొక్కమాటాడెద. కోపగింపవుగదా!

తే. గీ మహితసంగునకున్ మీకు మధ్య భీరుఁ
డుదయసింహుఁడు పుట్టక యుండెనేని
మ్లేచ్ఛసర్దార్లు తమకు సేవింపఁ గొలుచు
దీనగతి పట్టియుండునే దేశజులకు! 62

ప్రతా—ఇందు కోపకారణమేమున్నది. అంద అనుకొనుమాటయే. దానికేమి? రాజధానివిశేషములేమి? పాదుషాయొద్ద మనవారిచనవు మనవు లెట్లున్నవి?

పృథ్వీ—రాణావారెఱుంగని సంగతులేమిగలవు నానోట వినవలతురేని మనవిచేసెద.

సీ. సోదరి నర్పించి షాహుపాదయుగాంచి
మానసింగు గతాభిమానియయ్యె
యవనులతో వియ్యమంది వింగులు పొంది
మాలదేవుఁడు పచ్చిమాలయయ్యె
సుతమానమమ్మి విస్తృతరాజ్యమునుం గొని
కళ్యాణమల్లునూంగళ్యుఁడయ్యె
కులసతిమానంబు కుష్రోజుపాల్సేసి
రైసింగు కులయశోభ్రష్టుఁడయ్యె
పేరు మోసిన రసపుత్రవీరులెల్ల
స్త్రీలమానంబుఁ దురకల పాలుచేసి
మరియు మన్నారు కానంత పరువుపోక
పరువుఁ గోరెడువారికే బ్రతుకులేదు. 63

ప్రతా—సరియే. ఇవన్నియును విన్న సంగతులే. కాని ఆర్యా! వీరాధివీరులని పేరుపొందిన వారుగదా మీరిప్పుడు పేర్కొనినవారు. ఇట్లు పౌరుషము జారఁబుచ్చుటకుఁ గారణమేమయియుండునో?

పృథ్వి—కారణమా! (నిందాగర్భముగా.)

సీ. రాజ్యభారంబు దుర్భరమంచు నొందఁ
వంచి మ్లేచ్ఛుల కప్పగించినారు
కాపాడుకొంతయుఁ గష్టమంచు ధనంబు
మొగలఖజానాలఁ బోసినారు
స్త్రీలమానముఁగావఁ జాలమేమోయని
తురకజనానాకుఁ దోలినారు
రణరంగమందు దుర్మరణమేల యటంచు
నెంచి యస్త్రరు నాశ్రయించినారు

గీ. పీఠికకండయె లేనట్టి బిరుదుమగలు
రాజపుత్రకు లిన్ని కారణమ్ము లెన్ని
దీర్ఘకాలస్వతంత్ర ప్రదీప్తిఁ గోసి
పారతంత్ర్యంబు చవిఁజూడఁ గోరివారు. 64

ప్రతా—సేబాష్! పృథ్వీరాయా! చక్కఁగాఁ జెప్పితివి. అక్బరు తనవెనుక రాజ్య మెవరి కీయనున్నాఁడో?

పృథ్వీ—సలీమున కీయవలెనని యక్బరునకున్నది. వానినెట్లయినను ద్రొక్కుంబోతుఁ జేసి తన మేనల్లుఁడగు ఖుస్రూనకిప్పింపవలయునని మానసింగు భగీరథప్రయత్నములఁ జేయుచున్నాఁడు. కాని సాఁగదు.

ప్రతా—సాఁగ కేమి? అక్బరున కతనిమాట గురుపదమఁటే.

పృథ్వీ—ఎక్కడైన బావగాని యిక్కడమాత్రము కాఁడు. ఆతఁడు పరమ లౌకికుఁడు.

ప్రతా—మానసింగిప్పు డెక్కడనున్నాఁడు?

పృథ్వీ—సలీముతో వెడలి రత్నపూరు ముట్టడించుచున్నాఁడు. తత్కారణ రహస్యము మీరెఱింగియే యుండవచ్చును.

ప్రతా—ఎఱుఁగుదుము. ఎఱిఁగి తత్ప్రతీకారము చేయుచునేయున్నారము.

పృథ్వీ—ఇఁక నొక్కసంగతి దేవరవారి నడుగ సంకోచించుచున్నాఁడను.

ప్రతా—సంకోచమేల? నిరభ్యంతరముగా నడుగవచ్చును.

పృథ్వీ—(చెవిలో నేమో చెప్పును.)

ప్రతా—ఓయీ వెఱ్ఱిబావా! నేనక్బరును శరణువేడి యుద్ధమునకుఁ గొంచెము కాలావధిఁ గోరితినా? ఎవరన్నారు! ఉత్తది నాస్వభావమెఱుఁగని దొసంగున మానసింగు ప్రభృతులు నమ్మిరేమో! సర్వమెఱిఁగిన నీ వెట్లు మోసపోయితివోయి?

చ. జననము నొందినాఁడనఁట స్వచ్ఛతగంబు శిశోదియా కులం
బుఁ, రిపుహస్తిసింహులఁ బొప్పఁ డమీరగుఁగు మాకువంశ భూ
షణులఁట, సంగరాణ రిపుజైత్రుఁడు నాదగు తాతయంట, మ్లే
చ్ఛునకు శిరంబునంచు మనె క్షుద్రసుఖంబున కై యొకప్పుడున్.

పృథ్వీ—దేవా! మీరంతకన్న నధికులే. నిజము మనవిచేయుదు. చిత్తగింపుఁడు.

మ. కులమర్యాదలు మేము గోల్పడిన సద్గోత్రంబు నిల్పంగ ని
ర్మలబీజంబు త్వదీయవంశమున నే ప్రాప్తించుగా యంచు పు

ట్టెదు నాసంగొని యున్నవార మిఁక మీరే కీర్తిఁ గోల్పోవ నే
జలధిం జొత్తుము రాజపుత్రకులశౌచంబంతతోఁ దీఱదే. 66

ప్రతా—ఆర్యా! నాబొందెలోఁ బ్రాణముండ, నాబుద్ధి యీబొందెం బొందియుండ లోకనిందితంబగునట్టి పనిపుట్టదు. అదియేమి? చేతిలో నేమో యున్నట్టున్నది.

పృథ్వీ—ఇదియొక యుత్తరము. దేవరవారికొక రసపుత్రసామంతుఁడు శ్రేయోభిలాషి యను మారుపేరున వ్రాసియున్నాఁడు.

ప్రతా—ఏదీ! దయయుంచి చదువుము.

పృథ్వీ—చిత్తము. (ఉత్తరముతీసి యిట్లుచదువును.)

దండకము—శ్రీమన్మహారాజ! చిత్తూరుసామ్రాజ్యలక్ష్మీమనఃపద్మమిత్రా! పవిత్రోర్వియా సారవత్ భారతీమాతృగర్భంబునం దుద్భవం బాదుపున్నెంబు గన్నట్టి హిందూజమీందారి బృందమ్ములన్ దన్నిటన్ మిమ్ములనే నమ్మియున్నార మంబర్ పురాధీశ ముఖ్యాదిభూమీంద్రులు న్వీరు వారంచునుం బేరుకో నేల పేర్వడ్డ వీరాధివీరుల్ కులాచార మర్యాదలన్ వాసి గాసించి పోఁద్రోసి మాయాంసలెల్లన్ నిరాశల్ పొనర్పన్ ప్రతాపా! భవత్కీర్తి నేనమ్మియున్నార ముద్యత్ప్రతాపా! మహాసంగరాణా! హమీర్ బప్పరావల్ జగజ్జేత విఖ్యాతమూర్తుల్ చిరస్థాయిగా నిందు స్థాపించి యున్నట్టి సత్కీర్తిడిండీరముల్ సప్తవారాశితోయంబులన్ నాట్య మాడంగ నేఁడక్కటా! దిక్కులేనట్లు లీరాజపుత్రుల్ స్వవంశాభిమానంబు పోనాడి స్వస్త్రీలపావిత్ర్యముల్ మానముల్ లజ్జ నాకోసులో మ్లేచ్ఛసర్దార్ల పాల్సేయుచున్నార యీ మొన్న మాజ్ఞాతి రైసింగు భార్యాచరిత్రంబు విన్నట్టి యేరాజపుత్రుండు దామూఁతిపై మీసముల్ పూని మోమెత్తఁగా నేర్చు మా గౌరవంబుల్ ప్రతిష్ఠల్ సదాచారసంపత్తు లీరీతిగా నగ్గిలో బుగ్గిగా నౌదుమమ్మా! యటంచున్ స్వగర్భంబునం గన్న కూఁతుండ్రనుం గట్టుకొన్నట్టి యిల్లాండ్రఁ దోఁబుట్టులన్ సంతలోఁ బెట్టి తన్మాననుం గొల్లగా నమ్మి యార్జించుకొన్నట్టి విత్తంబునం బొట్ట పోషించుకొం

చు న్మదం బందుచున్నార మీవంశమం దొక్క మీరే కులాచార మిందఱ రక్షించియున్నారు, రక్షించుచున్నారు, రక్షింపనున్నారు; సుక్షత్రియా! పూతచారిత్ర! మీశీల సౌందర్యతుల్యంబుగా నెంచు కొంచెం దమిం జేయు నాచిన్ని విజ్ఞాపనం బున్న దాలింపుఁడీ! సుప్రసిద్ధంబు సన్మానసంపత్సమృద్ధంబును న్నిష్కళంకంబు మీవంశపున్ సాంప్రదాయం బయో! నేఁడు నౌరోజ్ బజార్ లోపలన్ బెట్టవద్దంచు వేమాఱు ప్రార్థించెదన్ సర్వసంపత్తియున్ లౌకికోద్యోగ సద్యోగచిహ్నంబులున్ నశ్వరంబుల్ సదా శాశ్వతంబై మనుం గీర్తియొక్కండయో! సర్వసర్వస్వముం గోలుపోవన్ స్వదారపరిజానీకమున్ దైన్యమందన్ మహాఘోరదారిద్ర్యదుఃఖంబు నేఁ బొందుచున్నానటంచు న్విచారింతురా! మీకు నిప్పట్టునన్ నష్టమైనట్టిదెల్లన్ యశోవృద్ధి చేరెట్టియై నట్టుగా నెంచుఁడీ, నేను పేరాసచే మ్లేచ్ఛసంపర్కసంతోషితస్వాంతులై పొంగుచున్నట్టి యీ రాజులే వచ్చి మీ కాళ్లపై వ్రాలి మాజాతి మాకీయుఁడీ! మాబహిష్కారముం బాపుఁడీ! యంచుఁ బ్రార్థించుకాలంబు దూరంబుగా లేదు; మేవారువీరాంతరంగాగ్నిభూమీధ్రగర్భంబుల న్నిద్రితావస్థయం దున్న శౌర్యోగ్రగంధాశ్మవాతాగ్నులం బ్రజ్వలింపింప మీఖడ్గధారామహద్ఘర్షణం బొక్కటే తక్క వేఱొక్క దిక్కేదియున్ లేదు ముమ్మాటికి న్నిమ్ము నే నమ్మియున్నార మో బప్పరాయాన్వయా! కార్యదీక్షాపరిపూర్ణంబు మీచిత్తమున్ నిత్యసద్గౌరవాసక్త మానవృత్తమున్ వజ్రివజ్రాయుధం బేని నిర్జింపఁగాఁజాలు మీచేతిఖడ్గంబులే ముఖ్యసాహాయ్యకర్తల్ సహాయంబు వేఱొండు లేదంచు శంకింపఁగాఁ బోకుఁడీ! ధర్మమె చ్చోఁ జెలంగున్ జయం బందుఁ దథ్యం బటంచు న్వినన్ లేదె భూమీధవా! ఘాముషానేమొ సంగ్రామకాలావధిం గోరినా రంచు నేకింవదంతి న్వినంగల్గుటం జేసి మిమ్మింత ప్రార్థింపఁగా వ్రాసితిన్ దైవమే మీకు సాహాయ్యమౌఁగాత మీ

ఖ్యాతి రక్షించుచుర్క శత్రురాడ్మర్దనా కీర్తిసంవర్ధనాంగా జయస్తే!
జయస్తే! జయః! 67

ప్రతా—ఆర్యా! ఎవరువ్రాసిననేమి? కవితాబద్ధమగు నీయుత్తరముం గనినంతనె
నాకు వే యేనుఁగుల సత్తువవచ్చినది. చూడుఁడు. ఈమాటలచేతనే,

మ. జయలక్ష్మిన్మఱలింతు నీక్షణమ, రాజస్థానసుక్షాత్ర భూ
జయశశ్యాఖలలర్ప వర్ష ఘనఘోషమల్ నాఁ జెవింజొచ్చె స
న్నియు ఢిల్లీశ్వరుఁడేని నన్నెదురనీ, నేఁడే చిరస్థాయిగా
జయకాళీయని పాఁతినానిదె జయస్తంభంబు మేవారునన్! 68

పృథ్వీ—జయము! జయము! మహారాణావారి ప్రతిజ్ఞ యప్రతిహతమగుఁగాక!
భామ—(ధనపుఁ బెట్టెలతో ప్రవేశించి) జయము. జయము. మహాప్రభూ!

చ. జయము! ప్రతాపభూప! తమసన్నిధికంపె ధనంబు యుద్ధపుః
వ్యయమున కాఱుకోటులు సువర్ణము లివ్వియె!

పృథ్వీ— ఎవ్వరాయుదా
రయశులుఁ?

భామ—పూర్వపుః సచివసత్తము భామసి!

ప్రతా— మంచిదే! రణ
వ్యయ మొనరింపుఁడీ! యిపుడెపంపుఁడిమంత్రికిమన్ననమస్కృతుల్.

పృథ్వీ—కవిశిరోమణీ? ఈధనము మనకెంతకాలము వచ్చునో లెక్కవేసి చూచితిరా?
భామ—చిత్తము! ఇరువదివేల సైన్యమునకు పండ్రెండు సంవత్సరములకు-
ప్రతా—సరియే! పిత్తపుమొత్తముమాట కేమిగాని యుపశ్రుతి మన కత్యంతోపకృతి
చేయుచున్నట్లున్నది. ఇఁక మహాగ్రము స్థిరపఱచుకొని జైత్రయాత్రకు వెడ
లుటయే తడవు. ఈవిత్తము యుక్తమగునెలవున భద్రపఱచుఁడు. రండు! లోని
కిఁబోవుదము. (అందఱు లేవఁగా లోనితెర యెత్తఁబడును. లోపల ప్రతాపుని
బిడ్డలును భార్యయు శ్రమించి ప్రసంగించుచుందురు.)

కమల—అమ్మాజీ సర్కార్! రత్నపూర్ సమాచారము లిటీవల నేవయినఁ దెలిసినవా?
కరణా—లేదమ్మా! పాపము! కుక్షింభరుఁడగు నల్లుని మూలమున రత్నవల్లునకు
ముసలికాలమున మిక్కుటములగు చిక్కులు రానైయున్నవి.

కమల—అమ్మాజీ! పాప మక్కయ్య మోహినీబాయి యిప్పు డెట్టి యవస్థయం దున్నది దోగదా!

కరుణా—ఏమియుఁ బ్రమాదము రాకూడదు.

అమర—భయములేదు. సింహవిక్రముఁడగు జయసింహుఁ డామెరక్షణకై పోయియుండెను. ఆమెవానినివరించి కంకణముఁగూడఁ బంపియుండెను గదా! తన్నే నమ్ముకొనియున్న కన్యాశిరోమణి రక్షణ నుపేక్షించుటకు మనజయసింహుఁ డంత మగటిమిలేనివాఁడు కాఁడు. అదిగో బాబాజీగారు సమిత్రబాంధవముగా నేవియో పెట్టెలు పట్టించుకొని యిందు విచ్చేయుచున్నారు. మీరు లోనికరుఁగుడు. (కరుణాదేవియును కమలయును లేచి లోనికరుగుదురు. అంత ప్రతాపాదులు పూర్వోక్తరీతినిబ్రవేశింతురు.)

పృథ్వి—అబ్బా! ఈగుహాంతర్భాగము పోవుట కెంతయు స్తరముగా నున్నది! ఒక్కమానిసియేనియు ధారాళము గాఁబోవుటకవకాశమున్నట్టులేదే!

ప్రతా—ఆర్యా! చిలుకపిల్లలను పిల్లులు మొదలయినవాని బారిఁబడకుండఁ బంజరములోఁబెట్టి రక్షించుచుండుట యెఱుగుదువుగదా! భయావహంబగు ప్రస్తుతపపాలనంబునను నక్లేశకనపిల్లలను మ్లేచ్ఛసైనికశార్దూల జాలము వాతఁబడకుండ నిట్టి గుహాపంజరములలోఁబెట్టి బంధింపవలసి వచ్చెను.

పృథ్వి—ఆర్యా! ఇట్టికష్టములు తమవంటికీర్తికాములకు మాత్రమేగదా!

ప్రతా—అవును. ఏధనముఁ గోల్పోయినను మానధనముమాత్ర మిట్టి పెట్టెలలోఁబెట్టియే కడుభద్రముగా రక్షించుకొనుచున్నాము. ఆర్యా! భద్రము. ఈయడ్డబడ్డు నానుకొని కడుజాగ్రత్తగా నీబండతాతిపైఁ గాలువేయుము. కాలుజారెనా పాతాళముఁజొచ్చియున్న యీకొండకాలువలోఁతు చూడఁగలవు.

బాణ—ఆర్యా! చేయూఁత యొసంగుదునా!

పృథ్వి—వలదు. వలదు. నేనే మెల్లఁగా దాఁటెదను. (దాఁటి) అబ్బా! నేటికి ప్రమాదము తప్పినది. (అందఱు గుహలోఁ బ్రవేశింతురు.)

ప్రతా—ఆర్యా! పృథ్వీరాయా! తిలకించితివా మాసంపత్తి?

శా. సత్పుత్రప్రభవంబు భోగములు రాజ్యశ్రీసుఖంబాది సం
పత్పూర్ణానుభవ ప్రమోదములు గూర్పంజాలు మేనాను భూ
భృత్పుత్త్రిల్ గద నీరలీకరణి దారిద్ర్యంబు ప్రాప్తింపఁగా
మృత్పాత్రంబులఁ దొట్టియుయ్యెలల బాలింపంగఁ గంటివే.

పృథ్వి—మహానుభావా! ఇదియొక లేమి కాదు.

మ. అభిమానంబును మానము న్యశము మ్లేచ్ఛాధీనముం జేసి శ్రీ
లభియింప న్మద మొంగు మాదుసిరియేలా, కాల్పనా, సద్యశ
శ్శుభ సంధాయకమౌ రసున్నిలిపి నీ మల్ గోరు కాలాగ్ని స
న్నిభమౌ ద్రవ్యము జాఱఁ బుచ్చితివహో! నీకేవి దారిద్ర్యముల్.

ప్రతా—ఏమో మీరందఱ ట్లభిమానించుటయే మాకుఁ గావలసినది. మిత్రులారా! రండు విశ్రమింపుఁడు. కవిశిరోమణీ! ఢిల్లీపురవిశేషములేమి?

బాణ—ఢిల్లీవిశేషములు విశేషములుగానే యున్నవి. మొన్న నౌరోజామహోత్సవములో నొక విచిత్రము జరిగినది. పవిత్రక్షత్రియవంశ సంజాతయు పతివ్రతా శిరోమణియు నగు రసపుత్రకాంత యొకర్తుక యందందఱు స్త్రీలే యుందురుగదా యని తనభర్తగారి యనుజ్ఞ నంతఃపురముం దేపొంది యుండి కుతూహలముచేత నుత్సవము చూడబోయినది. అందక్బరు స్త్రీవేషమును ధరించి సంచరించుచుఁ దొలకరి మించుం దృణీకరించు నామించుబోణి మేనిహొయలు గాంచి మించువిలుకానిచే నంచితుండై-

మ. అరికట్టెం జెఱబుద్ధి నాసతిని సాధ్వం బంను నూహించి సు
స్థిరసాధ్వీమణి దైవదత్తమగు కత్తిం దీసి ఝుళిపించి ము
ష్కరుఁడా! రాయిఁక నంటునన్ననిన పశ్చాత్తాపతప్తాత్ముఁడ
క్బరు తన్మోహ్యాస్మియటంచుఁ దానరిగెఁ దత్పాదంబులన్ వ్రాలుచున్.

ప్రతా—సెబాస్! సెబాస్! వీరపత్ని వంశసహజంబగు పని చేసితివి.

పృథ్వి—హాయి! హాయి! కాంతాశిరోమణీ! నిను గట్టుకొన్న యాతఁ డెంత ధన్యుండై యుండఁబోలును.

ప్రతా—ఎవరోయి జగత్కీర్తనీయ కీర్తిశాలిని యగు నాపతివ్రతాశిరోమణి?

బాణ—అట్టివారు వీరశిశోదియావంశమునఁ గాక యొందుచోఁ బుట్టనేర్తురా. ఆసాధ్వీమణి దేవరవారి సోదరి కమలాబాయి దేవిగారు.

పృథ్వి—ఏమేమి? కమలయా! నీచుఁడక్బ రెంతపని కొడిగట్టెను? ఆమె యిపుడెచ్చటనున్నదో?

బాణ—ఇఁకను బ్రాణముండఁగా ఢిల్లీపురపుమట్టి తొక్కనని ప్రతిజ్ఞఁబట్టి యుదయపురముఁ జొచ్చినారు. నేఁడో రేపో యిచ్చటికి రానున్నారు.

పృథ్వి—దేవా! ఇంతవచ్చినతరువాత నింకను పేక్షింతురా!

ప్రితా—ఉపేక్షయేది? సైన్యములు సర్వసన్నాహములై సన్నిహితముగానే యున్నవి. ముందు కమల్ మిరురు, ఆమీఁద రత్నపురము, పిమ్మట నుదయపురము స్వాధీనముచేసికొనుట కేర్పాటు—

బాణ—చిత్తము.

[అంత ప్రితాపపుత్రుఁడగు నమరసింహుఁ డొక యుత్తరముపట్టుకొని ప్రవేశించును.]

ప్రితా—కుమారా! ఆయుత్తర మెందునుండి?

అమ—జయసింహుని యొద్దనుండి. చిత్తగింపఁదగు. (ఇచ్చును.)

ప్రితా—(పుచ్చుకొని చూచి) కుమారా! మామాజీగారిఁ దోడ్కొని నీవు లోనికిఁ బొమ్ము. కవిశిరోమణీ! మీరు నాతోరండు. ఆర్య పృథ్వీరాయా! వీడ్కొని త్వరలో మరలవత్తును. (వైకిరాగాఁ దెరజాఱును. బూరా యూదఁగా భిల్లులు మూఁకలు మూఁకలుగాఁ బ్రవేశింతురు.)

పాట—రారే! రారే! మీరు! (పల్లవి)

ధీరప్రతాపు, బూరావినంబడె ॥ రారే ॥

1. చూరుగా కత్తిక । ఱారుచునూడ్చి
దారి మొగలుగాసి । వైరులనరొట్ట ॥ రారే ॥

2. తురక మూకలఁజూసి । చెలుకు గడలఁబట్టి
చురుకు చురుకున నెత్తి । దొరగాఁడ్ర గప్పంగ ॥ రారే ॥

3. ఘూటీలు గాటుచో । మీఁట రాలఁ బన్ని
బాటపూటకాఁగ మీఁటల వెడలింప ॥ రారే ॥

1. భిల్లు—బాబూ! బాణకవి బాబూ! బుద్ధి బుద్ధి! రాణా గారితో ముందునామీఁద సెప్పాల. దేవిడీకాడ మామిడైన నక్కపోఁతు ధాకలు సేసికొన్నాను. నిన్న వే మాయిారకోడు మాటొగ్గియేసినాడు.

2. భిల్లు—కవిబాబూ! బుద్ధి బుద్ధి! ఈదొప్పలో యిప్పతేనె మాజగిలిఁడొంతు. ఇదిగో యీదొన్నెలోంది సిన్నిపూదేనెనాది. ఆడికింద నాపేరు సెప్పాల బాబయ్యా!

3 భిల్లు—బానయ్యబాబోరూ! బుద్ధి బుద్ధి! ఇదిగో గోరోజనం, కస్తూరి, పుణుగు, జవ్వాజి నజరుపట్టుకొచ్చినాను. పెద్దపెబ్బగారితో సెప్పాలిబాబూ

బాణ—ఓరీ! భిల్లులారా! మీమీ కానుకలు పేరు పేరువరుసనను దెలిపెదను. కాని మనరాచవారి బలములను, తక్కినవారి నందఱిని రేపిక్కడకు వచ్చునట్లు వినా రున్నపాటున నూరూరు పల్లెపల్లెకుఁబోయి రాణావారిముదల చెప్పిరావలయును. రేపేదర్బారు. ఇదివఱలో మొహానత్ గా పనిచేసినవారి కినాము లీయఁబడును.

భిల్లులందరు—చిత్తం. బాబోరూ. బుద్ధి బుద్ధి. (నమస్కరించి పైపాటనే పాడుచు నిష్క్రమింపఁగాఁ దెర వాలును.)





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము.

(రాణా ప్రతాపసింగు)



చతుర్థాంకము.



1. రంగము—రత్నపురాంతకోటలోని ప్రాసాదాంతరము.

[మోహినీబాయి యేడ్చుచు జయసింహ ద్వితీయయై విశ్రమించియుండును]

మోహి—హా! దాదా! నామీఁద క్రోధమా! ఒక్కమాఱు నాతో మాటాడరాదా! నీకు దయలేదా! దాదా! దాదా!

జయ—బాలా! ఊఁటడిల్లు మూఁటడిల్లును ఎంతకాలమిట్లు దుఃఖించిన కలసివచ్చును!

మోహి—మిత్రరత్నమా! మాదాదాను ఆచూఱట్టు చెట్టుక్రిఁదనేగదా మగుడలేవని పొన్పనఁ బవళింపంజేసివచ్చితివి. ఒక్కమాఱుచూపరాదా! దిక్కుమాలిన నాపయి నీకు నక్కటికములేదా! దాదా! హాదాదా!

జయ—రాజపుత్రి! ఇది నీవంటిప్రాజ్ఞురాలికి వీలా! జేలా! ఒక్కనివేషము ధైర్యము చిక్కంబట్టుము.

మోహి—ప్రియమిత్రమా ఎట్లుచిక్కఁబట్టఁగలను? మాదాదాజ కందఱు తాతల వంటివాఁడు కాఁడే!

సీ. చిన్నప్పుడే నాకుఁ గన్నతల్లి నశింప
నగ్గుపాల్పోసి నన్నోమినాఁడు
కండనౌ నన్నిట్లు కొండను గావించి
కొండంత కొసి పొంగు చుండువాఁడు

నాకోడిదే యెల్లభూతలంబుచు నా
ముద్దుల చెల్లించి మురియువాఁడు
జవ లేని లేటి తల్లి చావుపిల్లను నన్ను
పొత్తిట నిడుకొని పోచినాఁడు
సినుము నాకింత చీమ కుట్టినను దనకుఁ
దేలు గుట్టినలీలఁ జింతించువాఁడు
నెపుడు నాసౌఖ్యమే మది నెంచువాఁడు
నెనరు గలవాఁడు మాదాద నేఁడు లేఁడు. 73

జయ—బాలా! ఈలీల పనవి పనవి దుఃఖించిన కొంచెమైన లాభమున్నదే?

మ. శతవృద్ధై చనె తాత నీవిటులు పజ్జన్ ఘోరమును చేడ్వ నా
మతిపోవుఁ గతియేమి? యూఁటిడిలు లేమా! గర్భనిర్భేద్యమీ
వెతకుం బారముగద్దె, దైవవిధి యుర్విం దప్పునేమును సం
గతియోచింపఁగవద్దె, యొక్కత్రుటిచిక్కంబట్టుమీ ధైర్యముఁ.

మోహి—కొండంత తాతనే మ్రింగివేసిన మొండికట్టియను, ఈ దుఃఖము మాత్రము దిగమ్రింగఁజాలనా? ఇదిగో దుఃఖమంతయు నడచిపెట్టి నిబ్బరముగానుంటిని. ఏమిచేయుమందురో చెప్పుఁడు.

జయ—సుందరీ! ఈ మందమతుల సుందరి యాలోచనయేమిగో నీకుం దెలియునా?

మోహి—తెలియకపోవుటేమి? దుర్గమాక్రమించుకొందురు. అటుపిమ్మట చేఁజిక్కిన నన్నెత్తుకొని ఢిల్లీకో, ఉదయపురమునకో గొంపోవుదురు.

జయ—అది కలలోనిమాటలే! దానికేమి? నేఁటు రేపటు వారుచేయనిశ్చయించిన కార్యముమాటు చెప్పుచున్నాను విను.

మోహి—అనిశ్చితమేమి?

జయ—కోట కాల్చివేయుట.

మోహి—కారణము?

జయ—ఎంతవెదకినను మనజాడ కానరాని కార్పణ్యమున.

మోహి—హా! ఎంతపని! (తనలో) రణమల్ రాజచంద్రా! నిశ్చయముగా నీవదృష్టవంతుఁడవు. ఈ దుష్టచేష్టితములు చూడకమున్న నీ నారింబట్టితివి. (జయసిం

హునితో) రాజకుమారా! ఏమీ! కోట కాల్చివేయుదురా? నావిషయమగు తుచ్ఛపు టూహతో నాతండ్రియు మానసింహుఁడును, ఇక్కడ యవనచమూ సమూహముతో నేమహార్ణమున కాలు పెట్టిరో యాగడియయందే కాలిపోయి నదే రత్నపూరుకోట!

సీ. కన్నతండ్రియె యిటు గావించె నని భీరు
మని యేడ్చునాడు శోకాగ్ని చేత
అల్లుఁడే తనయింటి కంతకుం డయ్యెఁగా
యని దిట్టు తాత శాపాగ్ని చేత
కుక్షింభరతఁ గన్నకూఁతు మ్లేచ్ఛుల కమ్మ
నైయున్న తండ్రి పాపాగ్ని చేత
ఎఱు యేదొ చూపిసోదరులఁ జీల్చినద్రోహి
యగు మానసింగు దోషాగ్ని చేత
దగ్ధమైపోయె నీకోట తనర నాఁడె
మ్లేచ్ఛు లిట నేఁడుణమున కాల్పెట్టినారొ
బూగ్గుమాత్రంబె మిగిలె నిప్పులనునార్పి
సంచయనకర్మ తగునింక సాగురునకు.

అయ్యో! దాదాజీ! అపారానిదైయెంత దిగమ్రింగినను సముద్రతరంగముల భంగి తెర తెరలుగా పొంగి పొంగి పొరలివచ్చు నీయగాధ బాధ నెట్లు భరింతును. ఈయపార విచారపారావార మెట్లు తరింతును! హా! దాదా!

చ. బ్రతికితి వెన్నదేడు లిలపైఁ గులగౌరవ మొక్కనాఁడునున్
వదలక చీకుకాలమున నాకతన న్వెతగ్గె, ప్రాణముల్
హృది కరముంచి నిర్మలతనీఁగెడు సౌఖ్యము లేకపోయె నేఁ
గద కత మూవ్యథావ్యథకుఁ గాల్పనె నాతనువింక భూమిపై 76

హా! దాదా! చిన్నతనంబుననే కన్నతల్లి కఱవైపోవ నన్నిటికి నీవయ్యె యేకొఱంత యుఁ జేకూరనీయక కొండంతాసతో కన్నులఁగద్దుకొని కాపాడుచుండినందుకు నావల్ల నీకుఁ దుదకు మంచిసౌఖ్యమే కలిగినది.

జయ—కాంతామణీ! ఇంత కడుపు పగిలి శోకించుట న్యాయమా! దురంతమగు నీవిచారకాసారమునకు పరీవాహ ముండఁకలదా! ఇంతకు మీతాతగారు నిశ్చింతగా నస్తమించినారు. ఇఁక శాంతిఁబొందుము.

చ. మగువరో గడ్డమూని బతిమాలెద నీవెత మానుమింక తే
నగునఁటె యెంత మొత్తుకొన నాతని నీతనువుల్ తిరంబు లే
జగమున చావుపుట్టుకలు జ్ఞానుల కొక్కటియే సుమీ శమిం
పఁగదె సుధీనిధీ! నతగుణా! తగునా! తెగునా వగందిగుల్! 77

మోహి—శూరాగ్రేసరా! మాదాదాజీగారు తమయవసాన సమయమునఁ దమతో నేమయిన చెప్పియుండిరా? నేనపుడు కార్యాంతరమున లోనికిఁబోయియుంటిని.

జయ—శూరుల కుపదేశింపవలసిన రహస్యము లనేకము లుపదేశించిరి. తరువాత నీవిషయమును గొంచెము చెప్పిరి.

మోహి—మిత్రరత్నమా! కరుణించి నన్గురించి దాదాగా రేమి వినిపించిరో యానతిచ్చెదరా?

జయ—సుందరీ! సొంతముగాఁ జెప్పవీలులేదు.

మోహి—(చనవుతో) పోనిండు. వీలయినంతవఱకే సెలవిండు. అతికుతూహలమునకు క్షమింపుఁడు.

జయ—సుందరీ! ఇందు క్షమించుటకేమున్నది! వారు నాతోఁ జెప్పినదంతయుఁ జెప్పెదవినుము.

ఉ. తల్లి గతింప నీలలనఁ దల్లియుఁ దాతయు నెంచ మల్లికా
వల్లియె నాఁగఁ బెంచితిని; పాతకుఁ డల్లుని వల్ల చేటు నా
కెల్లఁగనుండె; నెవ్వొది ఘటించెదొ మత్కులకీర్తి నిల్ప మా
పిల్లయు రాజ్యమింక వినిపింపఁగ నేరను నీకుఁ బైకథన్. 78

మోహి—(తనలో) అంతటిభాగ్యమా! ఈమందభాగ్యురాలికి. (పైకి) పోనిం డింతవఱకు విన్పించితి రిందులకే నేకృతజ్ఞురాల. పైరహస్యములు నాకేల?

జయ—సుందరీ! నీవిషయమై దాదాగారు చెప్పిన ప్రత్యక్షరముం జెప్పివేసితినిసుమా! ఇంచుకంతయు దాఁచియుండలేదు.

మోహి—మీరిపుడు "ఇంకవినిపింపఁగ నేరను నీకుఁ బైకథన్" అనుటచే నేమేని దాఁచియుంచిరేమో యనుకొంటిని.

జయ—అదియు దాదాగారు చెప్పినమాటయే. అంతవఱకే వారికి మాటాడుశక్తి యుండెను.

మోహి—హా! దాదా! కనుపులోని యూహ పూర్తిగా వెలువరించుటకైన నవకాశము లేకపోయెనా! హా! దాహితీవత్సలా! ఇంక నేమిమిచెప్పియుందువో గదా! దాదా!

జయ—సుదతీ! మరల నేన్నులోనికి దిగితివా! కొంచె ముపశమించితివేని దాదాగారు చెప్పిన పరమరహస్య మొక్కటి చెప్పెద. ఇందాఁకఁ జెప్ప మఱచితి.

మోహి—ఏదీ! ఏదీ!

జయ—'సతీ యూఱడిలుము. (నలుదెసలు పరికించి) ఇందెవ్వరును లేరుగదా! ఆమూపట్టు చెట్టుగుబురు జొంపములలో గలగల నేదో చప్పుడైనది.

మోహి—(దనవుతో) ఎవ్వరును లేరు. ఏ రోపక్షుల ఱెక్కల చప్పుడైయుండవచ్చును.

జయ—పక్షులచప్పు డట్లుండదు. చెట్టుపై నెవ్వఁడో మనుష్యుని సడియైనది.

మోహి—ఏమానిసి సడి యుండగాదు, అబ్బా! నన్నూరింపక చప్పునచెప్పుఁడు.

జయ—సుందరీ! అపాయసముద్రమున మునమిచ్చటినుండి తప్పించుకొని పైకిఁబోవుటకదియొక సుళువైనమార్గము. ఈకోటపాణిద్వారమునకుఁ బడమటికొమ్మున నొకపుష్కరిణి కలదుగదా! తద్గర్భగతంబయి సోపానములక్రిందినుండి యొక సురంగమార్గము గలదు. తద్ద్వారమునఁ బోను పోను వెల్లడియై యేనూరుబారల దూరములో నొక నేలమాళిగయుం గాళికాలయమునుం గలవు. ప్రస్తుతమచ్చటికిఁ బోవుటయే కర్తవ్యముగాఁ దోఁచుచున్నది.

మోహి—మిత్రరత్నమా! చిత్తము! ఎట్లైన నీప్రమాదస్థలమునుండి బయలఁబడినఁజాలు.

జయ—సరే! నేటిరాత్రియే ప్రయాణము. నీనగలను నాణెములను జక్కఁబెట్టుకొనుము.

మోహి—అన్నియు సిద్ధముగానే యున్నవి. మీసహాయమువలన నొక్కనగం గాపాడుకొనినంజాలు. అది యాత్మగౌరవము. అనగను విలువలేను. తక్కిన నగలు నాకంత లెక్కింపఁ దగినవి కావు.

జయ—కాంతాశిరోమణీ! అంత నిస్పృహ బూనుటకు నీకిపుడువచ్చిన భయమేమియు లేదు. నీగదిలోనికి రమ్ము. నీవస్తువులలో విలువగలవాని నాచేతికిమ్ము. లెమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

గులాం—(చెట్టునుండి దిగి పిటికితనముచే బెదరి బెదరి చూచుచు) ఆ! అచ్ఛారే! దోనోఁబీ చెల్గయా! పర్వానహి! మావీమంచిహద్సృష్టమ్. దొంగా దొరికినాఁడు.

పాట—దొరిఖినాఁడుదొంగ దొరఖినాఁడుమాకి ।
దొరకినాఁడుచోరు । దొరికినాఁడురా ॥
దొరకిసెప్పిమూము । సరిఖివేయిస్తాము ॥ దొరికి ॥
మెల్లిగా బెల్లించి । మీటీమాటలాడి ।
పిల్ల దాన్నియీఁడు । పెళ్ళాడా సూస్తాడు ॥ దొరికి ॥
హమారాఖార్కి పోతామ్ । హలుపాకీ చేస్తామ్ ।
కాఫీర్ దగాసెప్పి । ఖైదూసే యిస్తాము ॥ దొరికి ॥
(పాడుచుఁబోఁగాఁ దెరజాఱును.)



2. రత్నపూర్—కోటనుండి కాళికాలయమునకుఁ బోవు రహస్యమార్గమున

[మోహినీ జయసింహులు ప్రవేశింతురు]

మోహి—అమ్మయ్యో! ఎంతభయంకరముగా నున్నది. అగ్గిరక్కసుండు దుర్గమెల్ల నొక్కగుక్కఁ గబళించుచున్నవాఁడు.

తే. గీ. శిరమునందుండి ధూమము కేసరము లెగయ
మంట లనునాల్కలను జదలంటఁ జాఁపి
ఫటఫటధ్వని దంష్ట్రలు పగులఁజేయు
నగ్గిరక్కసి మ్రింగు సౌధాళి నెల్ల. 79

జయ—సుందరీ! భయములేదు. మనము ప్రమాదస్థలము దాఁటి కడుదవ్వు వచ్చితిమి. నావెనువెంటనే రమ్ము. గమ్యస్థానము సమీపముననే కలదు.

మోహి—ఇదే వచ్చుచుంటి. (కోటవంకఁ జూచి) అయ్యో! సమయమున కోరగాలి కూడ దాపరించినది. అగ్నిరానిదై యగ్నిహోత్రి మంతకంతకు విజృంభించుచున్నది!

జయ—అవునట్లే యున్నది.

లయవిలాసిని, భుగభుగశిఖజ్వాల, గగనానిలజ్వలిత
ఖగబింబమోయనఁగ, నగరులను గాల్చున్

పొగలెగయఁగా నగ్గి, సెగమూఁడి క్రొమ్మోడువడి
దిగులంది బొగ్గగుచుఁ, బగలగుమి మగ్గఁగ
ఖగతతీ వగంగూలి, గగనాపగం దటీము
నగునంచుఁ బాలుగతి నెగులు వినువీథిఁ
భగభగ వియద్వీధి, కెంబ్రాకు మంటసెగ
వగసింపి ఖేచరుల బెగడువడఁ జేయున్. 80

మోహి—ఓహో హో! మ్లేచ్ఛశిబిరములు చుఱుకు గిడ్డంగి యంటుకొన్నట్టున్నది. ఈ మాఱు జ్వాలాజిహ్వుం డొకంత శాంతించునట్లు లేదు. అగ్నిదేవునకు వాయుదేవుండు సహాయభూతుండు కాఁగా మంటలు నల్దట్టుల నొక్కపెట్టునఁ జుట్టుముట్టినవి. పాపము. రాఁకపోఁకలకు వీలుచిక్కక యవనచమూసమూహం బంతయు నొక్కముహూర్తంబున హుతాశనువాతఁబడునట్లున్నది. జ్వలనా! హవ్యవాహనా! శాంతింపుము. హా! హా! స్కంధావారములందు హాహాకారములు మిన్నుమ్రోయుచున్నవి. శిఖిజ్వాలలు మ్లేచ్ఛశిబిరంబుల దెస క్రొవ్వారుచున్నవి.

జయ—దంతిగమనా! వీతిహోత్రుని శాంతుంగమ్మని వేఁడుచుంటి వెంతబేలవు. పలుగాకులగు నీ కాకిమూకలపాటు దెరవులేదని గూడ విచారించుచుంటివి. ఎంతసత్యకాలము!

తే. క్రూరసప్తార్చి ప్రాశపాదిపి నగు
సిన్ను బట్టఁగ వచ్చి రీసిచమతులు
దివ్యో పుష్పవృష్టి ముద్దిష్ట దిప్పురుమినుత
అగ్నిఁబడి దగ్ధమాఁగాక హోయిఁగనునె! 81

వనజముఖీ! మనసైనిక నికాయంబు సర్వంబును మానసింగు కైదుచేసి యుదయపురమునకుం బంపివేసెనఁట. పోనిమ్మది యుమేలే. ఇక్కడనే యుంచినచో వీరిపాట్లే మనవారికిని తటస్థించి యుండును.

మోహి—వీరవర్యా! అగ్నిహోత్రుఁ డింకను శాంతించినట్లు లేదు.

జయ—లేదు. లేదు. (అగ్నికభిముఖుండై కేల్మోడ్చి) హుతాశనా! సర్వభక్షకా! సంపూర్ణాహుతిం గొనక శాంతింపకుము.

మ॥ జ్వలనా! కాల్చుము కాల్చు మింక నిటు మర్యాదాపాశములుం బ్రాపు
పులు లేకుండఁగఁ జేయుచూ గొనుము సంపూర్ణాహుతిన్ స్వర్గమున్
ఖలుఁడౌ సాగ్రజి వంశవైరి నుగ్రగ్రన్ మ్రింగుచూ హేయమ
న్నుచు నంబోకుమ సర్వభక్షకుఁడ నీనోటం బడన్ బ్రాతు వౌ. 82

(ఇరువురు నిష్క్రమింపఁ దొడఁగుదురు.)



3 రంగము—(రత్నపురికోటముందటి మైదానము.)

[సాగరజీయును మానసింహుఁడును బ్రవేశింతురు.]

మాన—ఆర్యా! సాగరజీ! అజయసింహుఁ డెంత మోసము చేసెను!

సాగ—అతఁడు జయవల్లరి కుమారుఁడుగదా! ఎంత సాహసకార్యమునకైన వెనుదీయువాఁడు కాఁడు. దుర్గదాహము వానిపనియేయని నాయనుమానము.

మాన—కోటకు నిప్పంటించి ఏమార్గగా త్రిపుడో వాఁడిందుండి దాఁటివేసి యుండవచ్చును.

సాగ—నాకు నదేయనుమానము. ఏదేని రహస్యమార్గమున వాఁడు తప్పించుకొని యుండవచ్చును.

మాన—కోట నాల్గుప్రక్కలను, ఆమీఁద పట్టణము నాలుగుదిక్కులను మనసిబ్బందులు కనుగలిగి కావలిగాయుచున్నవే. ఎక్కడికిఁ బోఁగలఁడు? ఎట్లుపోఁగలఁడు?

సాగ—జయసింహుఁడు కడు నేర్పరి. అతఁ డెట్లిందుఁ బ్రవేశించెనో మన మిదివఱ కూహింపఁ గలిగితిమా! ఎట్లుప్రవేశించెనో అట్లే దాఁటిపోయి యుండవచ్చును.

మాన—అయిన, గావచ్చును. అదే సలీంసాహుమాయుం డత్యుత్సాహముతో నిటు వచ్చుచున్నాఁడు.

సాగ—వారి కుత్సాహము లేనిదెప్పుడు! చిదానందపురుషులు!

సలీం—(ప్రవేశించి) మామాజీ! హుషారీమే దర్యాప్తు చేసి మోహినీబాయి సమాచార్ అవుర్ దగాఖోర్ జయసింగ్ పరారీకూపే దముతాక్కర్మే పైకితీసినామ్.

మాన—ఎక్కడ? ఎందున్నారు?

సలీం—బోలోరే గులాం! బోలో!

గులాం—అచ్ఛాసర్కార్ ! ఖల్ రాత్కూ ఖాన్కీమె ఖిల్లాఖాళీసేసి ఖందక్సే ఖాళీగుడ్కే యెళ్ళినార్ యిన్నామ్. సర్కార్.

సాగ—చి త్తగించివారా ! మన మూహించి నట్లే.

మాన—సరే! అయియుండవచ్చును. నీ కీసమాచార మెవరుచెప్పినారు ?

గులా—మాకీ యీరెండు నేత్రాల్ ప్రయమ్ సూస్నార్ సర్కార్. ఖల్ పూల్ బాగ్ మే జయసింగ్ మోహినీభాయి దోనోంభీ ఖాన్కీమే బడే కమామిష్ సేస్తూవుంటే సెట్టూమీదనుండి యిన్నామ్ సర్కార్. జూటీబాత్ బోలేతో జూతీసే మార్ మహారాజ్ !

మాన—సరే! మేమిప్పుడే ఆసురంగమార్గమునం బోయి నిజ మెఱింగివత్తుము.

సలీం—మామాజీ ! మాకీ రావాల్నీ హుద్దేహం ముఖ్యంగా వున్నాది.

మాన—కుమారా ! వద్దు. వద్దు. అందొకవేళ శత్రుసైన్యములుండిన నుండవచ్చును. లేదా, మోస మేనియుంగావచ్చును. భవిష్యత్సర్వభారముండవగు నిన్నట్టి ప్రమాదస్థలము నకుం దోడ్కొని పోరాదు. మిత్రమా ! సాగరజీ ! ఆయుధపాణులయి మీరు నావెంటరండు !

సలీం—మామాజీ ! జయసింగ్ కీ జేడీల్ యేసి మోహినీబాయికీ మేనాపర్ యేసి హాజర్యం పట్కారావాల.

మాన—సరే ! వారచ్చట నున్నచో నట్లే చేయవచ్చును. మీరుమాత్రము శిబిరమున మిగుల భద్రము. (సాగరజీతోం గలసి నిష్క్రమించును.)

సలీం—అచ్ఛా ! అరే ! గులాం. దారూ జరూ ర్నైలే ఆవు.

(ఇరువురును త్రాగుచుండంగాం దెరవ లఁను.)

4. రంగము—కాళికాదేవాలయము.

[మోహినీబాయి తదేకచిత్తముతో విగ్రహము నెదుట ధ్యానించుచు మోకరించి యుండును.]

మోహి—భుజంగ. భవానీ! మృడానీ! శివా! నీలవేణీ!
భుజాశిన్నివె దిక్కంటిఁ బోషింపు మంబా నే
వృక్షాళా ధరీ! నన్ గృపం జూచి నారే
రు! వే గావ రావే! సరోజాక్షి దేవీ!

ఓకాత్యాయనీ ! ఆర్తజనాభయప్రదాయినీ ! సదా త్వదీయపదారవిందంబులే మదీయ హృదయ మందిరమునందుం బొందుపఱచి నిఖిలప్రపంచమున్మఱచి నీవే సర్వమ్మని నమ్ముకొనియున్న దాన. కడుదీన. మతిహీన. నడిసముద్రములోని పడవ వడుపున సుడి గాలి కడగం డ్లెదిక్కున కీడ్చిన నాదిక్కునం బోవుచు నేఁగడియనో దరిగానరాని యీవిచారంపు గడలిం గడువనేరక దీని కడుపునం బుడుంగునంబడి యడుగంటనున్న దాన. చిన్నప్పుడే కన్నతల్లి కఱవైపోయె. కన్నతండ్రి దయాహీనమానసుండయి మానాభిమానములు పోనాడి కుక్షింభరత్వముచేఁ గన్నకూఁతురని యించుకేని సంకో చింపక కులభ్రష్టంజేయ నుద్యుక్తుండయి యున్నవాఁడు. పుట్టిననాటం గోలె కన్న సంతానముకన్న మిన్నగా నెన్నుకొనుచు నెందకన్నెన్నఁడేని నెడుంగనీయక కన్ను లనద్దుకొనుచుఁ గంటి కెప్పవలెఁగాపాడు మాతామహుండు, మహనీయసదాచారపరా యణుండు మాయదారిమిత్తి వాతంబడి మటుమాయమైపోయె. కన్నవారికిని బెంచిన వారికింగాక యేకాకినై పీకదక్కి తమోమయంబై సర్వశూన్యంబగు నీలోకమున దారి తెన్నులు గానరా కూరక పరిభ్రమించుచున్న దాన. ఓజగజ్జననీ ! జగదేకరక్షణీ ! ఆర్తజనాపన్నివారిణీ ! దుష్టసంహారిణీ ! నాయవస్థంగని కనికరింపుము. కరుణింపుము.

అర్చకుఁడు—(తొందరగాఁ బ్రవేశించి) రాజపుత్రీ ! మీతండ్రిగారగు సాగరజీయును జయపురాధీశ్వరులగు మానసింగుగారును లోనికివచ్చుచున్నారు. ఏమి సెలవు ?

మోహి—ఇఁక సెలవేమి ? నాకడపటిగడియలు సమీపించినట్లున్నవి. అయ్యో ! సమ యమున రాజయసింహ కుమారుండను లేకపోయెను. కోటలోని పూఁదోఁటలో దాదాగారిచ్చిన లోహపేటిక వఱకువచ్చుటచేఁ దిరిగి దానిఁ దెచ్చుట కచ్చో ట్రికిఁ బోయియుండెను. పోనీ ! నామాటకేమి ? దారిలో నాతనికేమియు సహా యము రాకుండిన నాకదియేపదివేలు !

శా. దేవీ! పావనరూపిణీ! భగవతీ! దేదీప్యమానప్రభా
నా! విశ్వాత్మకదేహినీ! శరణు నీపాదాంబుజాతంబులే
నావిజ్ఞాపన మాలకించి రిపుల న్నామాపశిష్టంబుగా
గావింపం గదె భక్తవత్సల జగత్కల్యాణి కాత్యాయనీ!. 84

(మోకరించి తదేకచిత్తయై ధ్యానించుచుండ సాగరజీమానసింహులు ప్రవేశింతురు.)

మాన—మిత్రమా ! దేవీవిగ్రహము నెదుట మోకరించి తదేకదీక్ష ధ్యానించు నామిం చుబోణియే మీకుమారీరత్నము కాఁబోలు ! ఆహా ! ఏమి యామె దైవభక్తి ! మీ కన్నియ చక్కఁదనముల కెక్కయేగాదు. గుణాలకుప్పవలెఁగూడ నున్నది.

గీ. రాజ! యిటువంటి పుత్త్రికారత్నములకు
సాగరుఁడ నౌదు నగుమొ రత్నాకరుఁడను
నర్థ మిచ్చెను నాగరాహ్వాయము మీరుఁ
బెట్టినారేమొ మీవారు పుట్టినపుడె 85

సాగర—ఆర్యా! ఇది కేవలము కవితాబద్ధమగు ప్రశంస. మాకుటుంబమునం దావిధమం డియుఁ దమకుఁగల వాత్సల్యముచే నట్లందురు గాని మేమేపాటివారము!

మాన—మిత్త్రమా! ప్రశంసకుఁ గాదుగాని మీపుత్త్రిక సర్వోత్కృష్టచరిత్త్రవలె నాకుం గనుపట్టుచున్నది. సుందరీరూపవతి; తదనుగుణ్యముగ గుణవతి, వివేకవతి, వినయవతియునై యుండఁబోలు. ముందుగా మీయకన్నడి పుత్త్రికాన్వేషణమునఁ బ్రసంగించి యెట్లయిన నిచ్చోటు వాపి యుదయపురమునకుఁ దోడ్కొని చను బందోబస్తు చేయుఁడు. ఇందు బహిరంగముగా నేను జోక్యము కలుగఁజేసికొనుట యతిక్రాంతమర్యాదగా నుండును. జయసింహుఁ డిప్పుడిందు లేనట్లున్నది. అతఁ డిప్పు డెక్కడికిఁ బోయినదియు నెందున్నదియు విస్పష్టముగా కనుంగొనవలయు. నే నిందే యుండెద. మీ కసాధ్యమైనచో నేను వత్తును. మఱిపోయి పనిపండించుకొని రండు.

సాగర—చిత్తము. మనచేతిలోనిపని. సాధించుట కేమికష్టము! వెఱ్ఱి తెలివులు నాకుఁగలవా! మొదటియూహకు నిర్ధనకములైన తురీయపంథ యుండనే యున్నది.

మానం—గోటం జిదుమఁదగువానికి గొడ్డండ్లేల? పోయిరండు. నేనిందే యుండెద.

సాగర—(పోయి దేవీవిగ్రహము నెదుట మోకరించియున్న మోహినిని సమీపించి బిడ్డా! ఇక్కడనా యుంటివి! అక్కటా! ఇంతదిక్కుమాలియుండ నీకేమి కర్మమమ్మా. లెమ్మ. మనయింటికి పోదమురమ్మ.

మోహి—అయ్యా! నా దిక్కెవరును గారు. నా కీలోకమున నెవ్వరును లేరు. లోకులతో నాకు జోక్యములేదు.

సాగ—అదేమమ్మా! అట్లనెదవు నీమనసు సరిగా నున్నట్లులేదు. ఆపదలపై నాపదలువచ్చుటచేఁ గాఁబోలు మది బెదరి చెదరిపోయినది. మోహినీ! మది కుదురు పఱుచుకొనుము. నేను నీతండ్రిని. మనయింటికి పోదమురమ్మ.

మోహి—నాకుఁ దండ్రియును లేఁడు తల్లియులేదు. భక్తజనకల్పవల్లియగు నీసతీమతల్లియే నాతల్లి. ఇతరులెవ్వరును నాకుఁగారు. నేనితరులకుఁ గాను. కరుణించి

మీదారిని మీరుపొండు. మీరెవ్వరో దేశద్రోహులవలె నున్నారు. మిమ్ము చూడ నాకుభయము- కాదు- అసహ్యముగా నున్నది. అదిగో మ్లేచ్ఛశార్దూలముల నాశ్రయించుకొన్న తోఁడేలు ఆపదను పొంచియున్నది. దానియొంగిలిడిను నీదుమ్ములగంతు నాకుఁ దండ్రియఁట. ముందుగా పసిఁబట్టుటకిక్కడికి బంపఁబడినది. దుష్టసత్వములారా! పొండు! పొండు! తెలియదా ఇది మృగేంద్రవాహన యుండుచోటు. మీయాట లిచ్చోటసాఁగవు

సాగర—ఆర్యా! మానసింహా! ఇటురండు. ఈమె చిత్తము స్వస్థముగనున్నట్లులేదు.

మాన—(సమీపించి) ఇవియన్నియు వేషములు. మీరూరకుండుఁడు. నిమిషములో నేఁ జక్కఁజేసెదను. (మోహినితో) ఓ రాజపుత్రీ! ఇట్టిపిచ్చివేషములవలనఁ బ్రయోజనములేదు. నీతో నొక రాజద్రోహి యుండెనఁట. అతఁ డెందున్నాఁడో చెప్పుము. లేకున్న నీకుఁ బ్రమాదించును.

మోహి—రాజద్రోహియా! దేశద్రోహులు, వంశద్రోహులు, స్వామిద్రోహులు, భ్రాతృద్రోహులు, లోకములో మీకు మించిన ద్రోహులీప్రపంచమునందు, కాదీముల్లోకములందును లేరు. పొండు. పొండు. మీరుతప్ప మఱియొక్కద్రోహు లిప్పట్టున లేరు.

మాన—ఓసంగనాచీ! దొంగవేషములు మాని గజదొంగయు రాజద్రోహియును దుర్గదాహకుఁడును నగు జయసింగిందు లేఁడా! చప్పునఁ జెప్పుము. లేనిచో నాతని తప్పు నీమూపునంబడి నీకు ముప్పుఁదెచ్చి పెట్టును.

మోహి—ఆర్యా! నీవేనా మానసింగవు? మీసోదరియే కాదా మాయమ్మ పట్టపుదేవి! పాపము! మీ చిన్నిమేనల్లుని యాటసామానే కాఁబోలు, షోలాపురినుండి వచ్చుచుండఁగా దొంగలెత్తుకొనిపోయిరి. ఆదొంగతనమా యిప్పుడు జయసింహునియం దారోపించుచున్నావు?

మాన—వగలాఁడీ! అధికప్రసంగముమాని జయసిం గెందున్నాఁడో చూపుము.

మోహి—ఓహో! మీకు జయసింహుం జూపింప వలయునా!

మ. జయసింహుం గనిపింపఁగా వలయునా? హా డే నెత్తింగింప ని
ర్భయులై పట్టఁగలారె! మెచ్చెదగు; సేబాష్! యోధులే! పైకర
ద్వయముంబట్టి యొసంగు మేమటుపయిన్ బాధింపఁగా నేర్తురుం
చయమో! పల్కెదరేమొ! నాకలవియౌనా! ఆఁడుదానంగదా!

మాన—అబలవుగదా యని మిన్నకుండిన కొలందిని నీవతిక్రాంతముగ వాగుచుంటివే.

వినుచుంటివా! జయసింహుఁడు రాజద్రోహి, దుర్గదాహకుఁడు. ఆతని యిక్కువ లెఱింగియు నిక్కాశము నఱుంగుపఱచిన నీకు మరణదండన తప్పదు.

మోహి—అయ్యా! నన్ను చంపివేయుదునని భయపెట్టుచుంటివా! నీవు రసపుత్రవంశసంజాతుఁడవేనా? రసపుత్రులకు చావొకభయకారణమా! నీకు మరణమన్న నంతభయమా? ప్రాణమన్న నంతతీపియా! ఓరిమానహీనుఁడా!

సీ. మానంపురమకు జన్మస్థాన మౌ దేశ
మాతను దారకకు మనుపుకన్న
తోడఁబుట్టువులఁ గూఁతుల బజారునఁ బెట్టి
కులవిహీనుల కమ్ముకొనుటకన్న
గోమాంసమును మద్య మామోదమునఁ దిను
మ్లేచ్ఛపంక్తిని విందు మెసవుకన్న
అడియాసలను పెంచి యన్నదమ్ములఁ జీల్చి
కూటికై యితరులఁ గొలుచుకన్న
తే. గీ. మరణమే కష్టతర మని మదిఁ దలఁచితే
ఉట్టికట్టక యూఁగుదే యుర్వి మీఁద
నిట్టిబెదరింపులం గట్టిపెట్టు మొకట
మాన మేదిర నీకు దుర్మానసుఁడ! 87

[తెరలో జయసింహుఁడు]

చ. నళినపు సెజ్జ భద్రమని సమ్మసుఖంబున నున్న హంసికా!
మొకుపతో మొఁగు మిఁక మ్లేచ్ఛుని వేల్పు, కిళంకుఁడున్ ద్విజా
తులపగవాఁడు, దేశికవధూవ్రతభంగరతుండు, సోదరీ
నిలయము గూల్చు రాజిటకు నేర్పునవచ్చెఁ జలింపకుండుమా.

మాన—(విని) అదిగో! రాజద్రోహి జయసింహునిమాట వినవచ్చుచున్నది. నేఁబోయి వానిబంధించి ప్రాణముతో ఢిల్లీకిఁ గొంపోవలయును. మీరన్నట్టులీమెకు చిత్తచాంచల్యమే కలిగినది. లేకున్న నిట్టిప్రేలాపనపట్టదు. ఈమె నెట్లయినను మనము ప్రస్తుత ముదయపురమునకుం గొంపోయి తగిన చికిత్సఁ జేయింపవల

జయ—అయ్యో! నేబుద్ధిమాలినపని చేసితి నే మోగదా! ఈదేశద్రోహియెడ యుద్ధ నీతి నాలోచించితిని.

మాన—(తిరిగివచ్చి యుద్ధమునకు సిద్ధపడుచున్నట్లెదురుగా నిలఁబడ నిద్దఱు సిద్దీలు వెనుకనుండివచ్చి జయసింహుని బంధింతురు.)

జయ—హా! ద్రోహీ! ఆఁడుదానిపని చేసితివిరా!

మాన—(సిద్దీలతో) కదలకుండునట్లు కాలుచేతులు గొలుసులకట్టిపెట్టుఁడు.

జయ—ఛీ! ఛీ! ఆఁడుదానిపని చేసితివిరా, రసపుత్రకులకళంక!

ఉ. వైరము సేయుజాతిపడెఁ గాన్పునఁ గేలను వాలమర్చుకోఁ
గా దయసేయు మొక్కఁ ద్రుటికాల రణావధినంచు వేడ నీ
పై దయఁజూప కిట్టిపని పాపము నాకయొనర్పఁ బూనినా
వా! మహితాత్మ రక్షకుని ఘాతుకుఁ జేయుట నీకువృత్తమా! 91

మాన—పోరా! పిచ్చిలరీ! ఇట్టి శ్రీరంగనీతులే నీయట్టివారి కిట్టియవస్థలోఁ బట్టుగొమ్మలు. (సిద్దీలతో) ఓరీ! మీ రీరాజద్రోహిని మిక్కిలి భద్రముగాఁ గొంపోయి మాయుత్తరువులు వచ్చువఱకు నాదయస్థిర కారాగారమున బంధింపుఁడు. పొండు. జాగ్రత్త!

(నిష్క్రమింపఁ దెరజాఱును.)



5. రంగము—మాల్ వాయురు రత్నపూరుకోటకు మధ్యమార్గము.

[యవనయోధు లొకయేటివంతెనను దాఁటుచుండఁగా ప్రతాపుఁడు నిజబలమును హెచ్చరించుచుఁ బ్రవేశించును.]

ప్రతా—ఏమిచెప్పుమా! మా రసపుత్రచమూసమూహంబు పిఱిగి పరాభూతమగుచున్నట్లు గన్పట్టుచున్నది. ఓహో! రసపుత్రయోధులారా!

చ. మరణము సాజమొందినొకమాఁటఘటిల్లును జంతుకోటికిఁ
దరుణము సంగతించినను దప్పునె యెప్పటికైనఁ, బాఱి మీ
చిరతరకీర్తుల న్మలినపుచేయకుఁడో రసపుత్రులార! సం
గరభువి బ్రుంగిన న్యశము గాంతురు పాఱినఁ జావుతప్పునే. 92

[అంత ప్రతాపపుత్రుఁడగు సమరసింహుఁడు పరుగునవచ్చి]

అమర—బాబాజీ సర్కార్! అల్లదే విరోధివరూథినీయూథం బొక్కపెట్టున నానదీగర్భంబునం గూలఁబడినట్లున్నది. ఇటు చిత్తగింపుఁడు!

చ. పురుషకృతంబొ దైవకృతమో కనుఁ డల్లదె! కేఁబవం తెరఁగా
మఱి సడలంగ నేటఁబడి మ్రగ్గు రిపువ్రజ మొక్కపెట్టునన్
గరముల నున్నకైదువులు గాత్రములం గవచంబు లున్నవున్నవ
ట్లొరగిరి నీటిలో యవనయోధులు సాయుధవాహనాఢ్యులై. 93

ప్రతా—కుమారా! అది శత్రుసైన్యమగుట నిశ్చయమేగదా!

అమర—అందునకు సందేహమేమి? తిలకించిరా!

క. నెలవంకయు రిక్కయుఁగల
తెలిజెండా యెగురుచునదిగో! దీన్ దీసనుకే
కలుఁ బాశ్చాత్యశతఘ్నుల
యులివులు వినలేదె! యవనయోధులు గారే! 94

ప్రతా—అంతమట్టునకు నిశ్చయమే కాని విరోధుల వంచింప మనవారు నొక్కొక్కప్పుడిట్టికృత్రిమచిహ్నములను ధరించుట కలదు.

అమర—అగుఁగాని మనవారు ప్రాణముఁబోయినను గేవల రాక్షసోచితములగు విషవాయుక్ష్వేళ నాళీకాస్త్రములను శతఘ్నులను ప్రయోగింప నంగీకరింపరు. అది పురాతనయుద్ధనీతికి విరుద్ధమఁట.

ప్రతా—సరియే! నీయూహ నిశ్చయమే కావచ్చును!

అమర—బాబాజీ సర్కార్! నాదొక చిన్నసంశయమున్నది.

చ. జలముల గాలిలోఁ జదల సంగరమాఁగ నరాని భూతముల్
కలఁబడి పోరుసల్పఁ గలకాలమువచ్చు నటంచు నెవ్వరో
పలికిరి మున్న పూర్వపు నిబంధనలం గొనఁగొత్త పద్ధతిన్
దలపడు శత్రుఁ గెల్చుటెటు? ధర్మము కాలముఁ బట్టి మాఱదే. 95

ప్రతా—అవును. రాజులంబట్టి ధర్మము మాఱుచుండును. కాలముఁబట్టి రాజు ప్రవర్తింపవలయును. ఇట్టి విషమావస్థలం దనుష్ఠించుటకుఁ గొన్ని ధర్మసూక్ష్మములు పూర్వశాస్త్రములయందే గలవు. మాటవరుసకు- దయ యందఱమానవుల

కుండవలసిన సామాన్యధర్మముగదా! అట్లని యుద్ధభూమిలో నొకయోధుడు తనచేజిక్కిన శత్రునియెడ దయజూపి విడిచిపెట్టవచ్చునా.

అమర—ఎంతమాత్రము విడిచిపెట్టరాదు. అనియేమి? బాణభట్టారియో క్రొత్తవార్తలను వినిపింప వచ్చుచున్నట్లున్నది.

బాణ—(ప్రవేశించి)

చ. కటకట! మిత్రమా! ఖలుడు కాళ్ళపయింబడె నంచు నేలయ
క్కటికముజూపి ప్రోచితివి? కాలభుజంగము వాడు కాటువే
యుట కెదలంచు; ప్రాణముల నోసిన నీరణధర్మ మెంచెనే
కుటిలమతిన్ వధించి తనుకొంటిరి వింటికురంత మింతలో. 96

అట్టి దుష్టబుద్ధిపట్టునఁనా సనాతనరణధర్మమూలోచించుట! అయ్యో! చేజిక్కిన దేశద్రోహిని విడిచిపెట్టి యెంతగట్టిపొరపాటుచేసితివోయి!

అమర—కవిశిరోమణీ! వార్తలేమి? ఎవనిఁగూర్చి మీ రట్లువిచారించుచుంటిరి?

బాణ—అయ్యా! మనజయసింహునిమాటఁను. చేతఁజిక్కిన మానసింగును విడిచిపెట్టి మీఁదుమిక్కిలి ఆ దుస్సంగుఁడు చేసిన మాయోపాయముచే నుదయపుర కారాగారమున నిప్పుడు ప్రాఁతకాఁపై యున్నాఁడఁట.

ప్రతా—ఏమీ! జయసింహుఁడేనా? ఎట్లు? మోహినియేమైనది?

బాణ—ఇదిగో! అతఁ డుదయపురమునుండి తనవెంపుడు పారావతముచేఁ బంపిన స్వహస్తలిఖితమగు నీయుత్తరము దిలకించిన యావద్వృత్తాంతము స్పష్టమగును.

ప్రతా—(పుచ్చుకొని చదివి నిట్టూర్పుపుచ్చి) అహా! ఇట్టివంచన ముందు పుట్టినవారిలోఁగాని యిఁకముందుఁ బుట్టఁబోవువారిలోఁగాని యుండఁబోదు. సరియే. దైవమున్నాఁడు. కాని మిత్రమా! బాణభట్టారకా! ఇందుఁ దుదిని లిఖింపఁబడిన గుప్తపేటికావృత్తాంతము సాంతముగాఁ జదివి చూడుము. (ఉత్తర మిచ్చును.)

బాణ—(చదివిచూచి) కులవృద్ధగణము లైన శాసనము మన కతిక్రమింపరానిది. ఆపేటికయం దేదియో యమూల్యవస్తు వుండఁబోలును.

ప్రతా—అమూల్యము కానీ! కాకపోనీ! ఆతనిశాసనమే మనకమూల్యము. కావున మనమిప్పుడే తదీయదేవ్యాలయమునకుఁబోయి యక్కడ నిక్షేపింపఁబడినదను పేటికఁదీసి యుదయపురమును సాధింప నేఁడే దాఁడివెడలవలయును. ఇప్పటికి మనవశమైన కమల్ మియుక్ గోగుండా మొదలగు దుర్గములను భద్రముగా



శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము

## (రాణా ప్రతాపసింగు)

## పంచమాంకము.

1. రంగము—ఉదయపురమార్గము నందలి మైదానము.

[ప్రతాపసోదరియగు కమలాబాయి చిత్రకారిణీవేషమునఁ గొన్ని పటములతోడను చిత్రలేఖనసామగ్రితోడను ప్రవేశించును.]

కమలా—పటములమ్మా పటములు! చక్కదనాల పటములు! ముద్దినుసుపటములు! ముద్దుగారుపటములు! * * * * * * *

(తనలో) ప్రస్తుతము కోటలోఁ బ్రవేశించుటకు నాకీవేషమే తగియున్నది. బాణభట్టు నాతోఁ జెప్పినమాటలే యిందన్ని చోటుల వినవచ్చుచున్నవి. ఒక్క మోహినినే కాదఁట; జయసింహునిగూడ బంధించి యిందు కొనితెచ్చిరఁట. సరే దుర్గముసమీపించితినిగదా! ఈవేషమున నిందుఁ జొచ్చి నేర్పుమై వచ్చిన పని సాధింపవలయు. (కొంచెము పరికించి) ఆహా! ఇది మాయుదయపురపుఁ గోటయేనా, ఆచూపట్టునదియే నా, ఉదయసాగరము! ఇప్పుడు నేనడచుచున్న వేనా చిన్ననాఁడు మే మాటపాటల వినోదించిన ప్రమదావనవాటికలు! అముచ్చటలును మురిపెములును నిప్పుడు కలలైపోయినవిగదా!

సీ. నటులు సింకను బాగ నచ్చుచున్నట్టి యీ
చోట మాగుజ్జెనగూటి పొయ్యి,
అదె మావిక్రిందఁ దా నసురు శిథిలమయ్యెఁ
బ్రియమైన మాబొమ్మ పెండ్లిపీఁట,

ఉన్నవింకను షట్ప్రియూఁడల సందఁడు
లీల మేచుఁగిన డోలిక లవె,
జీర్ణింప దింతకుఁ జెఱువుగట్టున బొమ్మ
కొలువుంప వేసిన కుంజశాల,
చేడెలంగూడి విరిబంతు లాడితి మట
మదమరాళంబులకు నడ ల్నేర్పితి మిట
కాన నగు నేటికెసి గను ల్గప్పినట్లు
లాటపాటలు మూఁచిన్ని నాటివెల్ల.

అదిగో! ఆపొగడచెట్టుక్రిందనున్న స్ఫటికశిలావేదికపై నిద్దఱు ముగ్ధియలు మాటలాడుచున్నట్లున్నది. వారే యొకవేళ మోహినీచంద్రికళలై యుందురేమో! ఇఁక నావేషము వినికిరిచేయవలయును. (పైకి) పటములమ్మా! పటములు! చక్కదనాల పటములు! ముద్దినుసు పటములు! ముద్దుగారు పటములు!

ఉ. చిత్రముల న్రచించుదును జీవకళ ల్పచరింతుఁ జిత్రపుం
బత్రములం దపూర్వమగు భావములం బ్రకురించుపట్ల నా
చిత్రము కృత్రిమంబొ నిజజీవియొ నా భ్రమియింపఁ జేయుగున్
చిత్రకళాభిమానలగు చేడెలు నాపసఁ జూపిమెచ్చుఁడీ! 99

(పూర్వోక్తరీతిని మోహినీచంద్రికళలు విశ్రమించి యుందురు.)

చంద్రికళ — రాజపుత్రీ! మోహినీ! ఎప్పుడును విచారమేనా! నలుగురితోఁ గలసి మెలసి కలివిడిగానుండు నీముద్దుమొగము చూచి యానందించు భాగ్య మిఁక మాకుఁ జేకూర్పఁదలఁచుకో లేదఁటమ్మా! ముద్దుగుమ్మా!

చ. కనులకు రాణివాసముఁ బెకప్పిద వెప్పుడు బాష్పపుందెరన్
వసితరో దృష్టిపాఱునఁటె వంచినయానన మెత్త వెప్పుడున్
వినవును బల్కవు న్నుడుల వీనులకుం జవిగానివారమే
మనముననున్న నీవెతలు మాకెఱిఁగించినఁ గొంచెమాను వే.

కమలా — (దూరముననుండి తనలో) ఆ! అది తప్పక చంద్రికళయే! ఆభోగపు తోఁట యిది! ఏదీకత్తి! దీనికుత్తుకను త్రెంచి తత్తునియలు చేసినఁగాని నాచిత్తము

స్వస్థపడదు. ఆదినమున- నాజీవితకాలములో మఱపురాని దుష్టరోజను ఆదుర్దినమున-నీతల్లి నన్ను వంచించుట కెంతయు యుక్తిచేసినది. అమ్మాయని పిలుపులే కుండ వాగు ప్రఖడ్గముచే దీని నిప్పుడ నఱికివేసి యుందును గాని దీనిమూలమున నింకను గొన్ని రహస్యములు తెలిసికొనవలసియున్నది. మరల నేమో మాట లాడుచున్నది.

చంద్రి—అమ్మచెల్లి! ఉల్లాసముగా నుండరాదటే! నీవెంతదిట్టరివే! నీకెంతపట్టుం దలయే! పదిం బది మేమెంతబతిమాలుకొనినను బెదరికదపిన పున్నెమునం బోవు! అదియేమి యపురూపమో గాని విరిబోడీ! నీపలుకే మాకు బంగారమగు చున్నది! ఉల్లాసముగా నుండవే! తల్లీ! మాకోరిక చెల్లింపవే!

మోహి—నా కుల్లాసమెచ్చటనుండి వచ్చును!

ఉ. పుట్టితి నీయుర్వీతలంబునం గనీవని ఘోరకట్టికన్
గిట్టనివాని కైవడి లిఖించె విరించి సృజించినప్పుడే
బిట్టువిచార మిట్లనుభవించుటకు పాపని మీర లూరకే
తిట్టిన నేమిలాభము గిట్టిననే గదా మొండికట్టెనే 101

చంద్రి—అబ్బా! ఎంతనిస్పృహాత్వము! బిడ్డా! నీవిచారముపోవు నుపాయము చెప్పెద వినుము.

మోహి—అది మీవలనఁగాదు.

చంద్రి—మావల్లననఁగా స్త్రీజాతివలన నని నీయుద్దేశము కాఁబోలు. పోనీ! మావల్ల గాకున్న నీకొఱకు వల్లనగువారి కాళ్ళనే పట్టుకొందుములే.

మోహి—అది మనుష్యమాత్రులవలనఁ గాదు.

చంద్రి—ఓహో! అల్లా! ఒకవేళ నీవిచారము మేమే పోఁగొట్టఁగలిగినచో!

మోహి—మీరట్లు లతిమానుషులే!

చంద్రి—ఒప్పుకొందువా?

మోహి—ఓ! తప్పక.

చంద్రి—సరే! ఎప్పుడో యొకప్పుడు; ఇప్పుడన్న నిప్పుడు కాదు సుమా నీదుఃఖము పోఁగొట్టుట మాపని. అదియేమి? జయసింహుఁడిటువచ్చుచున్నాఁడు! కారాగృహమునుండి యెవరువిడిపించిరి చెప్పుమా!

మోహి—(వికసితముఖియై) ఎక్కడ? ఏవైపున?

చంద్రి—చూచితివా! ఎంతలో వింతమార్పు నీమొగమునందుఁ గన్పట్టినదో! ఈ నిమేషమున నీస్వాంతమున నిసుమంతయైన వంతయున్నదని యెంతటిబుద్ధిమం తుఁడైనఁ జెప్పఁగలఁడా!

మోహి—సరే! బాగున్నది! వీరి కెక్కసక్కెము లాడుట కమ్మకుఁ జిక్కిన మేఁకను నేనొక్కతె నిక్కడఁ జిక్కితిని. మీకృవం బనియేమి?

చంద్రి—ఎక్కసక్కెములు కావమ్మా! అదిగో చూడుము. ఎవ్వరో వచ్చుచున్నారు దూరముగా నుండుటచే పోలితిపట్టనేరక జయసింహుఁ డనుకొంటిని నామాట బూటకమేమో అటుచూడుము! వారిటే వచ్చుచున్నారు.

[అంత కమలాబాయి ప్రవేశించును.]

కమలా—(తనలో) వీరు తప్పక మోహినీచంద్రికలే. సమీపించి వీరితో వెల్లఁగా స్నేహముచేసెదను. వారిప్పుడు నావైపున నే చూచుచున్నారు. ఇఁక నా వేష ము వినికిరిచేయవలయును.

మ. కొనరయ్యో! కొనరమ్మ సుందరులు! కోకొమ్మ దన్పుత్తా లద్భుతా
లనుగొన్నంతనె సొక్కిపోయెదరు గానంబన్ బల్కరిం
చిన మాటాడెడు నట్టుగోపికల తెల్పు చిత్రాలు చిత్రాలు ము
ద్దునకై చొక్కటిచేసి కొనుము మనసు చెప్పున్నచ్చును నచ్చిచో.

చంద్రి—ఎవరమ్మా నీవు! ఏమి విక్రయించుచున్నావు?

కమలా—పటములమ్మా! పటములు! ముద్దులసుపటములు! ముద్దుగారుపటములు! నేనొక క్షత్రియపుత్రిని; చిత్రలేఖనము నాయభిమానవిద్య!

చంద్రి—ఇటురమ్మా! కూర్చుండుము! ఏవీ! నీయొద్దనున్న పటములు! మంచి మంచివి తీసి చూపుము. కృష్ణుని బాలక్రీడలు, జలక్రీడలు, రాసక్రీడలు, గోపి కావస్త్రాపహరణము, కాళీయమర్దనము.

కమలా—ఉన్నవి. కాని మీబోటివారుంపించఁ దగినవి యంతకన్న మంచివి గలవు.

మోహి—రసపుత్రిపౌరుషమును దెలుపు చిత్రఫలకము లేమేని యుంగలవా?

కమలా—లేకేమి? లెక్కలేనన్ని గలవు! చిత్తగింపుఁడు.

సీ. ఉంచుఁడీ దీని సంయుక్త పృథ్వీరాజు
హరిణిపై నిరిదండ వైచుపటము,

కనుఁ డిదే పద్మినీకాంత యాత్మపుర
స్త్రీలతో నగ్నిఁ జొచ్చిన పటంబు,
ఇదె కనుం డక్బరు నెదిరి వీరాబాయి
విభు విడిపించిన వింతపటము,
కానుఁ డిదే యేకలింగని మ్రోల వీరకం
కణములు మనవారు గోసినపటము
ఎలమి నభిమన్యుకల్పుఁడౌ నేకపుత్రు
మృతివినియుఁ బోరు దుర్గావతీపట మిదె,
అదె హమీరుండు, బప్పరాయుం డితండు,
తెలియుఁడీ దీని సాగి గాథా యుతంబు. 103

చంద్రి—ఆహా! ఎంతచక్కఁగా నున్నవమ్మా యీపటములన్నియు— తరుణీ! ఇవన్నియు నీవు వ్రాసినవేనా?

కమలా—ఆహా! ఇవన్నియు నేనువ్రాసినవే. వలసినచో జనానావారు నావిద్య నిప్పుడు పరీక్షింపవచ్చును.

తే. గీ. ఎలమి నొకమాఱు చూచిన నెట్టిరూపు
మానిసియొగాని జంతువేగాని దేని
నైనఁ జిత్రింపఁగా నేర్తుఁ గాగితముల
భావములు కన్పడఁగా నేర్తు పటములందు. 104

చంద్రి—ఏదీ! చూతము! నీశిల్పకళానైపుణ్యము! ఇదిగో! ఈఫలకముపై మారాజపుత్రి చిత్రము లిఖింపుము! ఇందు నీపనితనము చూపింపుము.

కమలా—(పుచ్చుకొని మోహినీపటమును వ్రాసి) చిత్తగింపుఁడు.

చంద్రి—(పుచ్చుకొని పరిశీలించి) హాయి! హాయి! చిత్రలేఖనమున నెంతనేర్పరి వమ్మా నీవు!

తే. గీ. నలువ మ్రోల వసించి జీవుల సృజించి
క్షణములో ప్రాణములు పోయు శారదవలె

కలముఁ గుంచెయుఁ గొని యరగడియ మాదు
మోహిని వ్రాసితివి జగన్మోహనముగ. 105

సుందరీ! నీ చిత్రకళాకౌశల్యమెంతయుఁ బ్రశంసనీయము. కాని నాదొక్క కోరిక కలదు. మా రాజకుమారి చిరకాలమునుండి దురంతచింతాకులస్వాంతయై యున్నది. ఆమెచిత్తము రంజింపఁజేయుటకై నీవు వేఱొకరి చిత్తరు వందుఁ బొందుపఱచినంగాని యిది పూర్తి కానేరదు.

కమలా—ఎవరిచిత్తరు వందు హత్తింపనగును?

చంద్రి—ఎఱుఁగుదువుగదా! సాంబ్రాధీశ్వరుండగు జయసింహకుమారుని. ఆకుమారవీరుని సాకారము లేక యీచిత్తరు వీమెచిత్తము నాకర్షింపఁజాలదు.

మోహి—చాలు! చాలు! అవి నిశ్చయముగా మీమనస్సులందలి కోరికలు.

కమలా—నొచ్చుకొనకుండమ్మా! హాస్యమాడినంతమాత్రనే యాగ్రహింతురా?

చంద్రి—ఉవిదా! హాస్యమునకుగాదు. మీరా జయసింహు నెప్పుడైనఁ జూచి యుంటిరా?

కమలా—చూడకపోవుటేమి? ఆతఁడు రసపుత్రవీరకంఠీరవుఁడగు జయమల్లుని పుత్రుఁడు. మాబంధువర్గములోనివాఁడు. ఇదే చిత్తగింపుఁడు. ఆతనిచిత్తరువుగూడ ప్రస్తుతము నాయొద్దనున్నది.

చంద్రి—నాకెప్పుడు నాతనిఁ జూచుభాగ్యము లభింపలేదు. చక్కనివారిలో నెల్ల చక్కనివాఁడనియు, సుగటిమికిఁ బుట్టినిల్లనియుం జెప్పుకొందురు. అయినను చూపుఁడు. చిరపరిచయము గలదగుట మా మోహినియే విమర్శింపఁగలదు.

కమలా—ఇదే తిలకింపుఁడు. ఇదివఱకు చూడకున్నను లోచనపర్వముగ నీచిత్రముం జూచి యభినందింపుఁడు.

చంద్రి—(చూచి యాశ్చర్యముతో) ఆహా! ఎంతచక్కని యందకాఁడు. బ్రహ్మసృష్టిలో నిట్టి సర్వాంగసౌష్ఠవాకారులున్నారా యనిపించుచున్నది. బిడ్డా! మోహినీ! రావే! చూడవే!

మోహి—(చూచియుఁ జూడనట్లు చూచి చంద్రికయం దసూయాభావమును సూచించుచు.)

చంద్రి—ఆహా! ఏమి యీయద్వితీయసౌందర్యము!

శా. ఆకర్ణాంతదృగంతముల్ కనుఁగు కార్యాసక్తి సూచించు న
స్తోకంబైన విశాలఫాల మెఱిఁగించు న్బుద్ధిసంసిద్ధి దో

రాజ్యకోశంబయియుబ్బు పట్టుమానవోత్తంసుం డయ్యుండెఁ జుమీ సు
శ్లోకా జానుభుజస్వామి తెలుపు నిచ్చో పీనిశౌర్యోన్నతిన్. 105

బిడ్డా! మోహినీ! రావే! అనుభవింపవే కన్నులు గలిగిన ఫలము.

మోహి—(తనలో) అబ్బా! అపవిత్రచరిత్రుని చిత్రఫలక మీ యపాత్రు రాలిచేతం జూచుటకు నాకెంత యుఁ గష్టముగానున్నది! ఏమిచేయను!

చంద్రి—బిడ్డా! రావే! ఏ మాలోచించుచుంటివి! పోనీ! ఈదివ్యమంగళవిగ్రహ మాతఁ డగునో కాఁడో చెప్పనైన చెప్పుము.

కమలా—(తనలో) ముద్దుగారు నీనిద్దంపుటందకానిం జూచి యీపడపు విద్దియల లొద్ద కెద్దియో దుర్బుద్ధి యంకురించినట్లున్నది. నిజమునకు నేనుఁ బొరపాటే చేసితిని. కాని! ముందుసంగతి యాలోచింపవలయును. ఇదియు నొకమేలుకొ అకే వచ్చినదేమో! కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బయనునట్లు మోసమునకు మోసమేగదా ప్రతిక్రియ! ఎట్లయిన జయసింహుని కారాగారవిముక్తుం గావిం చుట ప్రస్తుతకరణీయము. (పైకి) అమ్మా! ఇది తప్పక జయసింహుని చిత్తరు వే. మీకనుమాన మున్నయెడల నాతని మీ రెప్పుడైనఁ జూడఁదటస్థించినచో సిగపట్టుచుకొనవచ్చును.

చంద్రి—ఎప్పుడో యననేల? ఇప్పుడాయనయీకోటలోనే చెఱసాలలోనున్నాఁడు. పోయి చూతమురమ్మా. చిత్రకారిణీ! నీవు మాకోటలో పదిపూఁటలు లాగకల యును క్షమా! దయయుంచి నాప్రార్థన చెల్లింపుము. మనము కలిసికొనిన వేళాపవేళ మేమియో నిన్ను వీడ మన సొప్పకున్నది. మోహినీ! నీవును వత్తువేమో రావమ్మా చిత్రపటపరీక్షకు.

మోహి—నేను రాను. వీరపురుషుల నట్టియవస్థలోఁ జూచుట మర్యాదకు విరుద్ధము.

చంద్రి—అబ్బా! ఏమిమర్యాద లెఱింగిన దానవమ్మా నీవు!

కమలా—మర్యాదల మాటకుఁ గాదుగాని—

తే. గీ. పంజరమునందు బంధింపఁబడిన మృగేంద్రు
సింహమును జూడ నా మనస్థితి తెలియునె;
అట్లె చెఱనున్న జయసింహునందు నీవు
చిక్కి సగమాట కలదొకో చిక్కెట్లు? 106

అందుకుఁ గాఁబోలు నీమందయాన సందేహించుచున్నది.

చంద్రి—ఓ చిత్రకారిణీ! నీవు మిగుల సమర్థురాల వగుటచే నొకరీతి మందరిఁ గాళ్లకు బంధము వేయుచు నింకొకరీతి నీమె యవినయమును సమర్థింపఁ బ్రయత్నించుచున్నావు. కాని జయసింహుఁ డెంతమాత్రము మీ కారాగారవాసముచే చిక్కి సగమైయుండఁడు. నిర్బంధ మతఁ డీమోహినికొఱకుఁ గోరి తెచ్చుకొనినదే. ఒకవేళ నిదివఱకే యువజనమునో మోహినియగు నీమోహినికిఁ జిక్కి సగమైనఁ గావచ్చును.

మోహి—ఔనౌను. అందుచేతనే! ఈచిత్రఫలకముం దిలకించిన తోడనే నాయొడలు పులకించినది. తొలిజవ్వనంపుఁ బ్రాదుర్భావమంతయు నొక్క బెళుకున గులకరించినది. మంచిచెడ్డల నెంచక యాతనిఁ బలుకరించుటకై యున్నపాటునఁ బరువు లెత్తుచున్నాను.

చంద్రి—చిత్రకారిణీ! వింటివా! ఈకొంటెపిల్లతుంటరిమాటలు! ఇటువంటిమాటలు వినిన లేనివారికైనఁ బుట్టుకొనివచ్చును. అగునా కాదా?

కమలా—పోనిద్దురమ్మా! పసిబిడ్డ! ఈమెమాట లోకపట్టా?

చంద్రి—(మోహినికి వినిపించకుండ) పాపము! పసిబిడ్డ! పాలుత్రాఁగుచున్నది. ఇటువంటివారే చూచుటకుచుంచులు, చేయునవి పందికొక్కు చేష్టలు! రమ్ము! పోదము. (ఇరువురు పోవుచుండఁగా గులా మెదురుపడును.)

గులాం—సలాం! సెంద్రికళాదేవీగార్కి చోటాసర్కార్ గులాఁ నోటితో సలాం సేసీ హుకుం సేసేది యేమఁటే.

చంద్రి—చుప్ (చెప్పవద్దని సైగచేయును.)

గులాం—ఈవుత్తరాం మే సూసికొండి.

చంద్రి—(ఉత్తరము చూచుకొని) ప్రభువునా రిప్పుడే ప్రమదావనమునకు వచ్చినచో దర్శనము చేసికొందునని చెప్పుము.

కమలా—(తనలో) సరే! ఈత్రాఁగుఁబోతుగూడ నిక్కడనే యున్నాఁడా! మోహిని విషయమై మఱింత కనుఁగలిగి ప్రవర్తింపవలయును. ఏవెఱవుననైన జయసింహుని విడిపింపఁ బ్రయత్నింపవలయును. ఈబోగపుఁదొత్తేలయో యాయుత్తరము మిక్కిలి గోప్యముగా దాఁచుచున్నది. ఒకయుక్తిఁ జేసి దానియందలి సంగతు లెఱింగెదఁగాక. (పైకి బిచ్చపాటతో) అయ్యో! నవయామున కొకకాగితపు ముక్కయైనఁ జేతఁజిక్కకపోయినదిగదా!

చంద్రి—ఏమీ? నీకేమి కావలయును?

కమల—ఏమియుఁ గాదమ్మా! చిన్న కాగితపుముక్క! నేత్రపర్వమగు దృశ్యమొక్కటి యిక్కడ దృగ్గోచరంబయినది. దానిని జిత్రించుటకొక చిన్న కాగితపుముక్క గావలయును.

చంద్ర—ఇదే గైకొనుము. ఇందు మిక్కిలిఁ గొంచెమే చోటు కలదు. నీపనికిఁ బనికి వచ్చునేమో చూడుము.

కమల—చాలునమ్మా! ఏమాత్ర మున్ననుఁ జాలును. జ్ఞాపకార్థము దిక్ప్రదర్శనముగా నొకించుక గుర్తించుకొనుట కున్నంజాలును. అది మీయుత్తరము కాఁబోలును ఏమైన రహస్య—

చంద్రి—నీయొద్ద మాకే రహస్యములును లేవు. ఇంక నొకనిమిషములో నామనస్సె నీయొద్దఁ బెట్టఁదలఁచుకొన్నాను. నీయెడ నాకు దాపరిక మేమిటమ్మా! మనము కలిసి యొకదిన మైనఁ గాకున్నను చిరకాలపరిచయులకన్న మిన్నయగు స్నేహము కలిసినది. అది వేళావిశేషమో లేక నీముఖమునందు సహజముగాఁ గన్పించుచున్న ప్రసన్నవశీకరణశక్తుల ప్రభావమో కావలయును.

చ. పసగలమాటలే యొరు నవశ్యను వశ్యను సేయుమంత్రముల్
మిసమిసలాడుచూపులె నిమేషములో ధృతిఁ బాపు తూఁపులౌ
మనసీయనుగుంచెయే విధికి మాఱుగ సృష్టియొనర్పఁ జాలు, నీ
రసనను వాణియుం గనుల లచ్చియుఁ గేల విరించి యొప్పరే!

అదె జయసింహుఁ డుండు కారాగారము సమీపించినారము. నీకొక పరమరహస్యము చెప్పెదను. నీకడుపునఁ బెట్టుకొని నాకిందులోఁ జేతనగు సాయము చేయుదునని నా చేతఁ జై వేయుము. (చేయిజాఁచును.)

కమల—మావంశీయుల నోటిమాటయే ప్రమాణము. తెలియనియంశములో ముందుగా మాటయిచ్చి యొట్టుఁ బెట్టుకొనఁజాల.

చంద్రి—అయిన నిన్ను నేనెట్లు విశ్వసింపఁగలను?

కమల—విశ్వసింపకున్నఁ బోనిండు. నాతో నట్టిసంగతులే చెప్పకుఁడు. మీకేమి బందెయా బలవంతమా!

చంద్రి—సుందరీ! క్షమింపుము. నాకడుపులోని యోచన యిది. (చెవిలో నేమియో చెప్పి) ఇందులో నీసహాయ మపేక్షించి యుంటిని.

కమల—సరియే! ప్రయత్నింతము. కాని నేను చెప్పినట్లు మీరు వినవలయును. మీకోటు

లోని పరివారము కొద్దిదినములు నాచెప్పు చేతలలో మెలంగునట్లు సర్వదుం ఖాలాయగు హుకుమొకటి నాకు దయచేయింపవలయును. * * మఱచితి మఱొక్క మనవియున్నది. అగత్యమైనయెడల మనపనిలో సహాయము చేయు టకు త్రికాలవేదులగు పెద్దలు మాగురువుగారొకరున్నారు. పనిపడినప్పుడు వారినొక్కపరి యిచ్చటకు రప్పించుటకు నాకనుజ్ఞ దయచేయింపవలయును. నావి హిరణ్యాత్మవరము లనుకొందురేమో మున్ముందు నాసంగతి మీకే తెలి యఁగలదు.

చంద్రి—నీవేమిచెప్పిన నదిచేయుటకు సిద్ధముగా నున్నదాన. అగ్నిలో దిగుమన్న దిగియెద. నీటిలో మునుఁగుమన్న మునిఁగెద. ఎట్లో కార్యముమాత్రము సాధింప వలయును. చూచితివా! ప్రస్తుత మీయుదయపురపుఁగోట నావశమై యున్నది. నేను నీవశమై యున్నదాన.

కమలా—సరియే శక్తివంచనలేకుండఁ బ్రయత్నింతము. మీరు ముఁదునడువుఁడు. (తనలో) అబ్బా! ఈపడఁపుట్టింటి కడుపులో నెంత తలకుమించిన యోచన కలదు. కాని! దీనికిఁ దగినప్రాయశ్చిత్తము చేయింపకున్న నేను కమలనే కాను. ఈతార్పుగత్తె నాఁడు నన్ను వంచింపఁ దననేర్పు చూపినదిగదా! నేఁడు దీనిని వంచింప నానేర్పు చూపించెద.

(ఇరువురు నిష్క్రమింతురు.)

మోహి—(వ్యాకులచిత్తముతో నుద్యానవనమునందలి యొక వేదికపై విశ్రమించి) హా! పరోపకారపరా! స్వార్థత్యాగశీలా! జయసింహకుమారా! మందభా గ్యురాలనగు మన్నిమిత్తమున నీవెంతటి విపత్తులకుఁ బాత్రుఁడవగుచున్నావు! అక్కటా! నాదెంతపాపిష్ఠిజన్మము. స్వకామ్యసంతుష్టికై నీయట్టి లోకమా న్యోత్కృష్టచరిత్రులఁ గష్టములంగూర్చి దేశమునకుఁ గలసిరాని మహారిష్టములను దెచ్చిపెట్టుచున్నదాన. ఏయుపాయము చేతనైన నాయీదురదృష్టపు జన్మముం ముదముట్టించిన లోకమునకు మేలుచేసినదాన నగుదును.

(నిష్క్రమింపఁ దొరఁకొనును.)



## రంగము—రత్నపూరుకోట.



[ప్రతాపుఁడును బంధుమిత్రులును ఉచితాసనములపై విశ్రమించి
కార్యాలోచన సేయుచుందురు.]

పృథ్వి—మిత్రమా! ఇం దాశ్చర్యమేమున్నది! ఖద్యోతకాంతివలె పాపమప్పటప్పట తాత్కాలికానందముం గూర్చుచుండినను తుట్టతుదకు దానిఫలముఁ గట్టికుడుపక మానదు.

చ. పొలుపఱి యెవ్వరెల్లు చెడిపోయిననేమి! స్వకీయకార్యముల్
సులువుగనైనఁ జాలనుచుఁ బలుకొంపలు గూల్చెపేఁడు; వ
ర్ధిలఁగలఁడే! కృతఘ్నుఁడు దేవుఁడు లేఁడెయొకంటు; నూఱుగో
వులఁ జెడదిన్న రాపులుఁగు బ్రుంగదె తానొక గాలివానకున్.

బాణ—అభిమానహీనుం డగును, ఆత్మగౌరవశూన్యుండు నగు నామానసింహున కీదెబ్బతోఁ బూర్తిగా శృంగభంగమై యుండనోపు.

అమర—స్వకార్యసిద్ధికై నిరంతరదుర్వ్యాపార పరాయణులగు నట్టివారి కిట్టిశృంగభంగముల వలన బుద్ధిరాదు. శిరశ్ఛేదమే వారికి బుద్ధిచెప్పుమార్గము. ఇంతకు వాని కిప్పుడైన శృంగభంగ మేపాటి?

బాణ—ఇంకేమి గావలయును! కమలామానభంగ- (నాలుకఁ గఱచుకొని) నాటి కుష్రోజు ముచ్చట యట్లు పరిణమించెనుగదా! నేఁడు కుస్రూకు రాజ్య మిప్పించవలయునను ప్రయత్నమిట్లయ్యెనుగదా! అన్నట్లు చెప్పుట మఱచితి. కుస్రూయిప్పుడు మతిచెడి మానసింగు కనుపడిన నఱికివేయుదునని యుఱికిపడుచున్నాఁడఁట.

ప్రతా—కారణము?

బాణ—తనసోదరి నర్పించునపుడు మానసింహునకు నక్బరునకు రహస్యపుటొడంబడిక యొండు జరిగియుండెనఁట.

ప్రతా—అది యేమైయుండునో?

బాణ—తనభాగినేయునకే భవిష్యద్భారతరాజ్య మిప్పించవలయునని.

పృథ్వి—ఆమరతుమీఁదనే యోధాబాయి యక్బరుం బెండ్లియాడుట కంగీకరించెనని వదంతి.

బాణ—ఇప్పుడక్బరు తనయనంతరము సలీమునకు రాజ్యమిచ్చి వేయుటకు నిశ్చయించుటచే నామె యాశ లడుగంటినవిగదా! అందుచే నామె విషము తిని మరణించినది. తనతల్లిచావునకు మేనమామయే కారకుఁడని మానసింగుపై కుమారి పగఁబట్టియున్నాఁడు. సలీమున కీసు స్వతంత్ర మెట్లో తెలసినదఁట. ప్రస్తుతము విజయలక్ష్మి తనయెడ పెడమొగము పెట్టుటచేఁ దాను పాదుషా దయ కెక్కుడ దూరస్థుఁడగునోయని వేదేవతలకు మ్రొక్కుచున్నాఁడు. అంత కన్నఁగానక బ్రతికిన మానసింగున కింతకన్న శృంగభంగ మే ముండును.

ప్రతా—సరియే! ఇరియన్నియు మనకనుకూలములే. కాని యింతతో ప్రతాపుఁడు సంతుష్టిపొందఁ జాలఁడు.

గీ. ఉదయపురమును సాధించి పిదప మాన
సింగు సాగరజీల నశింపఁ జేసి
తురక పురుగుచు చిత్తూరు త్రొక్కకుండఁ
జేసిపంగాన సుఖనిద్రఁ జెందుదున్ను! 109

పృథ్వి—ప్రభుచంద్రమా! తమరిక నట్టి చిత్తాందోళన మానవసరములేదు. అట్టి కాలము సమీపించియేయున్నది. సాగరజీ మానసింగులును సలీమును ప్రస్తుత ముదయపురముననే యున్నారు.

అమర—అయ్యలారా! నాకొక యాలోచన పొడకట్టుచున్నది. మానసింహుఁ డిపుడు స్వబలంబులతో మనరాజ్యములో నున్నాఁడుగదా! ఇయ్యెడ మన మనదళంబులఁ గొన్నిటివాని రాజ్యముపై కంపిన—

చ. మన మిపుడే రహస్యముగ మార్గమునం జయపూరుకోటలం
గొన మనసేనలం బనిచి కోట్లలసేసిరి మేని మానసిం
గునకును బుద్ధివచ్చు కలకొంత్రవ్వఁడు గున్ బలమూరు నక్కకా
టునకును జెప్పుదెబ్బనుటుల్ సరిపోవును చాసిచేఁతనుఁ.

బాణ—దేవా! చిన్నవాఁడైనను చిరంజీవి చెప్పిన యాలోచన కనుజ్ఞానునీయుఁడు. దేవర యనుజ్ఞ—

ప్రతా—అనుజ్ఞ కభ్యంతరమేమి? చిరంజీవి రహతూరుదళంబులతో జయపురదండయాత్రకు నేఁడే బయలువెడలవలయును. పృథ్విరాయలు నిజవాహినీసమూహముతో నిందే నిలిచి రత్నపూరుదుర్గము రక్షించుచుండవలయును. కవిశిరోమణి

యుం మేమును శిశోదిరూబలంబులతో స్వయముగా నుదయపురదండయాత్ర నడపింతుము. రే పుదయమే ప్రయాణము. ఈమా ఉదయపురదుర్గము సాధించి కాని తిరిగి రాఁ దలఁచుకొనలేము.

పృథ్వి—రాణావారు సిద్ధసంకల్పు లయ్యెదరుగాక.

బాణ—ఆర్యా! పృథ్వీరాయా! అనుమానమేల? అప్పుడే మన కుదయపురము స్వాధీనమైనట్లే యెంచుకొనుఁడు.

మ. కదియ న్వచ్చిన శత్రులన్వటికి తద్గాత్రాస్థిఖండాసృజ్మసిక్
పదునౌ నూశరలేఖినీప్రజముతో వ్రాయించి పంపింతు మీ
కిదె యూహాస్త్రనపుఁ బత్రికల్ త్రొంగరండీ, పృథ్వీరాయా! జయా
స్పదుఁడైనట్టి ప్రతాపసింహుని జయస్తంభప్రతిష్ఠం గనన్.

పృథ్వి—తప్పక వచ్చెదము ద్విజకులసార్వభౌములగు మీమాట యోటగునా?

[తెరలో వందిమాగధులు.]

చ. ఉదయధరాధరంబున మయూఖసహస్రముతోడ నాయకుం
డుదితుఁడు గాకమున్నె రిపుయోధతమోహరణం బొనర్చుచూ
యుదయపురీనుఁ డీతఁడు జయోద్ధతుఁడైన ప్రతాపసింహుఁ డీ
యదనున మేలుకొం డనికి నంపుఁడు వేఁ దెలుపుం డుదంతులన్.

ప్రతా—అదే! హజారమున వందిమాగధులు బలముల మేలుకొలిపి దండయాత్రకుఁ బ్రయాణముహూర్త మాసన్నమైనదని తెలుపుచున్నారు. ఇఁక లెండు. సిద్ధము కండు.

అందఱు—(లేచి) మహాప్రసాదము. (అందఱు నిష్క్రమింపఁ దెరజారును.)



రంగము—ఉదయపురపుఁగోటలోని యంతఃపురము.



గులాము—(హజారమునఁ బ్రవేశించి) అల్లా మాకీమంచిహాదృష్టమ్ వాసి సార్. ఎన్ని తంటాల్ వచ్చినా మాదిమాటా మీద్కి ఎక్కింది. మాచోటాసర్కార్ సలీమ్. పాదిషా అయిపోతార్. ఢిల్లీతక్తుపర్ వుంటాన్. అప్డూ మాకీ దేఖ్నానికి రెండూ కాదు. రెండులచ్చల్ రెండుకోటుల్ నేత్రాల్ వుండ్వాల. తేర్కిపాదిషాసలీం

అమల్కీ షామత్ గులాం. ఎన్నె వుస్నా క్యాఫాయిదా ? నాకీ యింకా పూరా అదృష్టమ్ పట్టిందిలేదు. దిల్ పర్ ఏక్ బిచాక్ సైతాన్కే మాఫక్ సంపాకంటూ వుంటూంది. చంద్రకళా మాకీ హాదృష్టంసే బీబీహైతో బహూత్ అచ్ఛా ! ఎంతహాదృష్టం. ఎంతయానందం, ఎంతడాబూ, ఎంత డంబం, ఎంతనీమూ, ఎంతజామూ, ఎంతగోటూ, ఎంతనీటూ ఆ ! ఇదే చంద్రిక కాయిక్డే ఆలోచన్ సేస్తూ సోఫాపర్ వుంది. ఇక్డావుండి ఏమియేమీ ఆలోచన్ సేస్తూవుంది ఖాస్కే మేయింటాహు. (పొంచి వినుచుండును.)

చంద్రి—(వ్యాకులచిత్తముతో) ఆహా ! సంప్రాప్తయౌవనయగు పువ్వుబోణి కభీష్టవరసమాగమునకు మించినయానందమును, అనిష్టపూరుషసంధాన సమావేళ గోష్ఠులకు మించిన కష్టములును ప్రపంచమున నుండవుగదా ? అబ్బా ! ఎంతకష్టమెంతకష్టము. అందుదానికన్న నధమాధముండగు నీసాగరజీని కట్టుకొని నేను కాఁపురము చేయవలయునా !

చ. మగటిమి నిండుసున్న యభిమానవిహీనుఁడు మానసింగు దా
బిగువునఁ బిచ్చిపెట్టినదె బిచ్చము వీనికి రూప మున్ననో
పగలు కనంగ రాత్రి కల వచ్చు నిరక్షరకుక్షి సాగ్రజీ
ని గలిసి కాఁపురంబు వలెనే వెలిగింపగ నాతబోనే. 113

ఇటువంటిదియేగదా యింతబ్రతుకు బ్రతికి యింటిముందఱఁ జచ్చుట ! ఛీ ! ఛీ ! ఆసాగరజీ పేరెత్తిననే నా కొడలు మండుచుండును. నే నానీచు నెంతమాత్ర మంగీకరింపఁ జాల. ఆవల మానసింగునకే కోపముగానీ; అక్బరే యాగ్రహింపనీ ! వారెవ్వరుమగారే వానితోఁగాఁపురము చేయువారలు. కాన నిఁక కామదేవుఁడేయాన ! జయసింగునే వరించుదాన.

తే. గీ. కూడ జయసింహునే జతఁగూడవలయు
లేనిచో బ్రహ్మచర్యంబె పూనవలయు
పుంబుపండ్లెన్ని తిన్నను ఫలముగలదె;
తియ్యమామిడి పండొండుఁ దినినఁజాలు! 114

గులాం—(తనలో) అచ్ఛారే ! ఈ సెంద్రిలంజా కడుప్లో యెంతఘుట్టియాలోచన్ వుందిరా ! ఇప్డూ దీని దొంగతనం భయల్పెట్టీయేస్తామ్ అని బయంసెస్తె మాకీ మంచిలాభంవస్తావీ ! ఆ ! ఇంకాయేదో యేదో అంటూవుంది.

చంద్రి—హా! జగన్మోహనమూర్తీ! జయసింహకుమారా! కందర్పసుందరాకారా! మారా! నాకొక్కమాఱు నీకౌఁగిలి దయచేయరాదా! ఇదే చేతులుచాపుకొని నిన్ను దిమిపట్టుకొనుటకై యెదురు తెన్నులు చూచుచుంటినే. ఆ! వచ్చితివా! రమ్ము రమ్ము! రయమ్మున నీకౌఁగిలియిమ్ము. (అని చేతులుచాఁచి పరిభ్రమించుచుండఁగా గులాము చేతులసందునుండి దూరి ముద్దుపెట్టుకొనఁ బోవును.)

చంద్రి—(దూరముగా నేగి) ఛీ! ఛీ! దూరా! ఎవ్వఁడవురానీవు!

గులాం—మేము యెవర్ నీకీమాలుమ్నహీ! చోటాసర్కార్ సలీంకే ఖాస్కా వజీర్ గులామ్ మసూర్ద్! మాలుమ్హై! ఆవ్! ఆవ్! ఆలింగన్ దేవ్.

చంద్రి—ఓరోరి త్రాగుఁబోఁతా నీకింత తలపొగరేలరా! కనులు నెత్తికెక్కినవా! మానసింహునితోఁ జెప్పి నీగుడ్లూడఁబెఱికింపకున్న నే చంద్రికళ నేకాను.

గులాం—మేరబాత్ సునో సెంద్రికళా! గుస్సా అయిపోతే క్యాఫాయిదా? ఒకాక్కముద్దా మాకిదేవ్. పర్వానహీ. ఇక్డా యెవరూలేరూ! ఎవర్కి సెప్పేది లేదు.

చంద్రి—ఓరీ! దున్నపోఁతా! నీకు ముద్దుకావలయునా?

పాట—ఏకతాళము-సంభాషణ.

చంద్ర—దురితమతీ! త్వరితగతిం దొలఁగురా! నీవిప్పుడే॥ త్వరితగతిం దొలఁగురా! గుణముతుగలిగి మెలఁగురా! తలపొగరా! వలపుమొగుడ! తలకుమించి పరువెత్తఁ దగురా! తెగురా నీతల॥ దురిత॥

గులాం—వగలాఁడీ! తెగనీల్గకె! పొగరుమాటలాడకే! పొగరుమాటలాడకే! వగలుమిగులఁ జూపకే! మగవాలవె! తెగనీల్గెదు! మగఁడొకఁడెు వెలయాలికి! మాఁడలిడినవాఁడె మగఁడు॥ వగలా॥

చంద్ర—జ్ఞానహీన! ఇంకినీ! హీనబుద్ధిమానవా! హీనబుద్ధిమానవా! యింతకన్నుగానవా! మానవాధమా! యిదెల్లమానసింగునోఁడఁ దెలిపి! మన్నాకానింతునీకు॥ దురితమతీ॥

గులాం—ఓహో! ఆమానసింగు గుత్తచేసెనే సనుక! గుత్తచేసి

నాఁడఁటే! పుస్తెఁగట్టినాఁడఁటే! చిత్రిని నీయెత్తులన్ని చిత్తం
బున కెక్కనేమి! చేయించెదనో చూడుము ॥ వగలా ॥

చంద్రి—ఛీ! ఛీ! అర్ధరాత్రమున రాణివాసమునఁ బ్రవేశించి మానభంగము చేయ యత్నింతువా?

గులాం—క్యా! క్యా! సానీదానికి రాణీవాసం. మానాభంగం. ఎంతవింతసమాచార్! అవ్! అవ్! జా సీగడ్‌బిడ్ సేస్తే నీవింతదాకా సేస్తూవున్న ద్రోహం దురాలోచన్ అంతా మానసింగ్కి సెప్పేయేసి నీప్రాణం తీయించి యేస్తామ్. దగాఖోర్ జయసింగ్కి పట్టకాయెగిసి పోడానికినీకీ వుద్దేశం. కంచె నీవాలా! సాగర్జికి దగాసేసి మానసింగ్ కట్లో వట్టీమెయ్యడానికి తల్చి వున్నావ్ హుండా. హుండా. నీగుట్టూబట్టాబయల్ సేస్తామ్.

చంద్రి—(తనలో) అయ్యో! ఈదుష్టుఁడు నాదుస్తంత్రసంతయు వినియున్నాఁడు. వీని నింక బ్రతుకనిచ్చిన నాకొంపతీయును. (సైకె) ఓరీ! త్రాగుఁబోఁతా! లేనిపోనిమాటలాడు నీనోటికి కిదేబుద్ధిచెప్పెదఁ జూడుము. (కొట్టఁబోవును.)

గులాం—(తిరిగి కొట్టఁబోయి) రా! రా! ఆడదానికి నవం జలం మాకీలేకపోయిందిలేదు. (ఇరువురు కలఁబడి యల్లరిచేయుచుండఁగా చిత్రకారిణీ వేషమునన్న కమలాబాయి ప్రవేశించును.)

కమలా—అర్ధరాత్రమున నంతఃపురములో నీయల్లరియేమి? (ప్రవేశించి చంద్రికతో) ఏమమ్మా నీకేమివచ్చిపోయినదా! ఆగులాముతో చేయి చేసికొందువేల? ఒకవేళ వాఁడు మత్తిల్లి తప్పుడుమాటలాడినను వానిని సమాధానముచేయుట నీపని. హుజూరుసాఖులతో విరోధపడిన చాల ప్రమాదమని యెఱుఁగవా!

చంద్రి—ఎంతకనియోర్తునమ్మా వీనిత్రాగుఁబోఁతునడకలు! చెప్పకొనటకు సిగ్గు! నేను వానినిఁ బెండ్లిచేసికొనవలెనఁట! ఇంటివా వీనిచేటుకాలము!

కమలా—సరే! నేను వీనిని సమాధానముచేయుదును. ఇంతలో నీవు లోనికేగి (రహస్యముగా) మోహినిదుస్తులు, వస్తువులు ఏమైన నున్న సంగ్రహింపుము. వానితో మనకిప్పుడు తప్పనిపనియొకటి యున్నది.

చంద్రి—సరే! ఇదెంతపని! అలాగుననే చేసెదంగాని పోయినపని యేమైనది? కాయా పండా?

కమలా—హుష్. ఇప్పు డామాటలెందుకు? ముందు నేఁ జెప్పినపని చేసికొనిరమ్ము.

చంద్రి—ఇదే! ఉన్నపాటున. (పోవును.)

కమలా—గులాం! ఇటురా. ఇప్పుడు మీయిద్దఱికి జరుగుచున్న ప్రసంగమంతయు నే వింటిని. నీవు నన్నెప్పుడు చూచియుండలేదు. పాదుషా కార్యముమీఁద నే వేగుఁ గనవచ్చితిని. ముందుముందు నాసంగతి నీకుఁ దెలియఁగలదు. ఈ భోగపుఁదొత్తు నీతో నిప్పుడింత బెట్టుచేసినదిగదా! నేఁజెప్పునట్లు వింటివా యీ రాత్రియే యిది తనంతవచ్చి నిన్ను బతిమాలుకొనునట్లు చేసెదను.

గులాం—అంతకన్నా మాకీయింకా యేమిహాదృష్టం పట్వాలా! తల్లీ ఆలానేస్తే మీరుసెప్పినట్టూ యింటామ్. మీపాదంకొట్టి ప్రమాణంసేస్తామ్. (కాలుపై చేయివేయఁబోవును.)

కమలా—(దూరముగాఁ దొలఁగి) అల్లరచేయక మెల్లఁగా మాట్లాడు. ఇవే జయసింహుఁ డుండు చెఱసాలతాళములు. వీనింగొని యిప్పుడే నీవచ్చటికిఁ బోయి నీదుస్తులు వానికిచ్చి వానిదుస్తులు నీవు ధరించి జయసింగువలె నటించుచు నందుండి వానిచే నాకీ తాళములు మగుడ పంపించవలయును. చంద్రికళ వచ్చి యెంతబతిమాలినను నీవు పెదవి కదుపరాదు.

గులాం—అమ్మా! ఇదీబడేతంగా! జయసింగ్ మాదీబాత్ యింటార్?

కమలా—భయములేదు! నేనంతయు నిదివఱకే యేర్పాటుచేసితిని. జయసింగును మనపక్షమునకు విడదీసియుంటిని. లేకున్న నాకీతాళము లెట్లువచ్చును! ఏమో యిందులో నీకుపకారము చేయవలయునని యాలోచించితిని. గులాపు బుద్ధియగుట నీవనుమానించుచున్నావు.

గులాం—సై! సై! తల్లీ! మీరూసెప్పినట్టూ సేస్తామ్. దేవ్. దేవ్. (అని తాళములు పుచ్చుకొనును.)

కమలా—ఇదిగో! మఱియొకమాట. అచ్చటి ఫారావా రనుమానింపకుఁడ జయసింగునకు చోటాసర్కార్ వద్దనుండి యుత్తరము గొంపోవుచున్నానని చెప్పుము. లేదా వేఱొకమిష చెప్పుము.

గులాం—అచ్ఛా! అచ్ఛా! అంతా బడేహుషార్సే సేస్తామ్ (పోవును.) (చంద్రికళ మోహినిదుస్తులతోడను నగలతోడను బ్రవేశించును.)

చంద్రి—ఏఁడీ గులామ్? ఆపిశాచము వదలిపోయినదా?

కమలా—పోకయట్టేయుండునా! నచ్చఁజెప్పువారిలో నున్నది.

చంద్రి—చిత్రకారిణీ! ఏమైనను నీమొగమునందు వశీకరణమహాత్మ్యకటి యున్న దమ్మా లేకున్న నెట్టివారైనను నీకు లోఁబడిపోనేల? ఏమయ్యెను. అతఁ డంగీకరించెనా?

కమలా—నేఁజెప్పుటయు నంగీకరింపకుండుటయునా! కాని మఱొక్కమాట. అతనిని కారాగృహప్రాకారము దాఁటించువఱకు నీవు మోహినీబాయివలెనే నటింపవలయును. అతఁ డొకవేళ మాటాడకున్నను నీవవమానింపఁగూడదు. అతఁ డనుమానముచేఁ దురకవానివలె నటించును. నీవుమాత్రము పొఱపడకుమా! జాగ్రత్త! మోహినివలె నీవు నటించుటలోనున్నది.

చంద్ర—మోహినివలె నటించుటకేమిలే! ఆమె యాకారము నాకెచ్చటనుండి వచ్చును?

కమలా—ఇదిగో! చూచుచుండుము. నిమిషములో నిన్ను మోహినింజేయలేకున్న నావిద్యయేల? రమ్ము! నాముందుకూర్చుండుము. నిన్ను మోహినిగా మార్చెదను. తలలు మార్చుటలో నిన్నును రూపము మార్చుటలో నన్నును మించినవారు లేరు. నిన్నెందుకు తెమ్మంటిననుకొంటి వీవస్తువులు. (చంద్రకళ తన ముందు కూర్చుండ కమలాబాయి మోహినీబాయివస్తువు లామెకు శృంగారించుచుండును.)

చంద్ర—చిత్రకారిణీ! ఆమోహినికింత యసమానబుద్ధియేల! నాటినుండియు నామె వైఖరి చూచుచుంటివికదా!

తే. గీ. ఏను జయసింహుఁ డనఁగఁ జిట్లించు మోము,
కోర నే వానిఁ గన కనుల్ కుట్టుకొనును
తాళిఁ గట్టిన మగఁ డోటు? తనకతండు
మోహినికి నింత యసమానబుద్ధియేల? 115

కమలా—అది స్త్రీలకందఱకు నైజము. కొత్తగా నన్నడిగెదవేల? ఏకఫలాపేక్ష-ఇదియె టింగిరియేకదా నిను మోహినివలె ముస్తీబుచేయుచుంటిని. ఇప్పుడద్దము చూచుకొమ్ము.

చ. అలకల నుంగరాలవళుఁ ట్టులు ఫాలము మీఁది యంచునన్
వెలికలు చట్టితిం బొమలు నీటుగ నెత్తితిమై గులాబిరే
కుల కలపమ్మునర్చి తిదిగో తిలకమ్మును గొప్పఁబెట్టితిన్
పొలతిరో నిల్వుటద్దమదె! మోహినివో మఱికావొ చూచుకో.

చంద్ర—(నిల్వుటద్దము నొద్దకుఁబోయి తనకొత్తముస్తీబు చూచుకొని) ఆహా! ఎంత నేర్పరివమ్మా నీవు! నాయీకొత్తరూపు నాకే వఱలు గొలుపుచున్నది. నా

కన్నులు నన్నే భ్రమింపజేయుచున్నవి ! ఇఁక నా జయసింహుని ఘక్కఁగొనుటొక లెక్కయా !

తే. గీ. నెలత! శిల్పకళ నీదు నేర్పుఁ జూపి
చిటికెలోన నన్ను మోహినిం జేసితిగద!
వలపువిద్దెల నాకున్న పొలుపుఁ దెలిపి
చేరి జయసింహు మోహినిఁ జేయలేనె!. 117

కమలా—ఓ ? తప్పక చేయఁగలవు ! మోహినికిఁ బలె చీరకట్టు నీకింకను నేర్పవలసి యున్నది. పోదుమురమ్ము.

(ఇరువురు లోనికిఁ బోఁగా దెరజాఱును.)



రంగము—అంతఃపురము.



[మోహినీబాయి యొకమంచముపై విశ్రమించియుండును.]

మోహి—(తనలో) ఆహా ! నాదెంతయదృష్టజాతకము ! ఈ యదృష్ట మొక్కనన్నే కాదు నా గాలిసోఁకినవారి నెల్ల చుట్టిముట్టి కొట్టుచున్నది.

ఉ॥ తల్లియుఁ దండ్రియు న్విడువఁ దాతయె త్రాతయు నేతయౌచు న
న్నెల్ల విధంబులం బెనిచె; ఏమిసుఖించె నతండు! దుఃఖపుం
వెల్లిమునుంగు నన్ను మఱిపెం జయమల్లు సుతుం డితండు నా
వల్ల భుజించె నేమి! చెఱపాలొగదా! బ్రతుకేల నా కిఁకన్. 118

కావున దురంతములగు చింతలకాకరమై, ప్రపంచమునకు భరమై, మేలుచేయవచ్చిన వారికెల్ల మహోపద్రవకరమై, కరము నసహ్యాకరమైన యీకళేబరము నీధరాతలము నుండి యెంతత్వరితముగాఁ దొలఁగించిన లోకమున కంత మేలుచేసినదాననగుదును. ఓపంచభూతములారా! మీకొక్క చిన్నవిన్నపము. అనాయాసముగాఁ బంచత్వము నొందువర మొక్కటిమాత్రము నాకనుగ్రహింపుఁడు. సద్వినియోగము చేయుమని నాకు మీరనుగ్రహించిన మీమీగుణములను శక్తులను క్రమ్మఱ గ్రహింపుఁడు. నావశముచేసిన మీమీసొత్తుల నిదివఱ కెట్టి దుర్వినియోగము చేసి యుండలేను. ఎఱుంగక చేసిన దోసంగు లున్న మన్నింపుఁడు. ముక్తి ననుగ్రహింపుఁడు.

మ. పుడమీ! నీయొడి సుంతచోటిడుచుఁ గొంపోరావె నన్వేగ, సూ
ర్యుడ! వేఁజేతుల వేడివేలుపువు నీయుంజేయ లేవే ననుం,
పిడుగో భూతము పంపి నన్నుడుప లేవే నీవు నాకాశమా!
కడలీ! నీకు ససహ్యమా? కరువలీ! కానైతివే నీవున౯. 119

తల్లీ! భూదేవీ! నీవత్యంతశాంతమూర్తివని చెప్పుకొందురే ! నన్ను నీకడుపులోఁ బెట్టుకొని నాకడగండ్ల నడగింపరాదా ! ఓ సూర్యభగవానుఁడా ? కర్మసాక్షివగు నీకన్నుఁగప్పి నేనేమిపాపకర్మములు చేసియుందును ! కన్నెను విపన్నను. ఏప్రశ్నెము నేపాపము నెఱుంగను. నన్ను లోఁగొనరాదా ! నిఖిలలోకపావన జీవనప్రదుండవగు నోజీవనదేవా! వరుణా! నిరంతర కరుణాతరంగితాంతఃకరణా ! ఎట్టియపాత్రులనైన స్పర్శమాత్రినే పవిత్రీభూతులంజేయఁ గంకణము ధరించిన ఘనులలో నెల్లఘనుండవుగదా నీవు ! నామనః పంకేరుహము మిక్కిలి బింకముగా సంకించుకొనియున్న యీవ్యాకుల పంకంబు నింకించి నిష్కళంకంబుగాఁ జేయనేరవా ! వాయుదేవా ! నీవు వ్యాపింపలేని తావేలేదే! అధికారపిశాచావేశ పరవశులైన యీనరపశులకంటఁ బడకుండ నన్నెందేనిఁ గొంపోరాదా! ఎందుకు మీగండలు సందేహించెదరు ! మీలో నొక్కరికైన నేనక్కఱకు రానిదాననైతినా !

[అంత సలీమ్ ప్రవేశించును.]

సలీం—(తనలో) అచ్ఛా ! అచ్ఛా ! మంచిహావకాశం సిక్కింది. ఎహీంవఖత్ మే చెమక్సే మొలాఖత్ సొసాయింపుసెయ్యాల ! కేవలం మెహర్బానీ కామండా, గుస్సాచేయకుండా, అమల్ సూప్ సేసి, అనురాగం కాప్ సేసి గుల్ సబ్ పూల్మే మహబ్బత్ కైస్సె పానంసేసినట్టూ బెట్టూసేసీ సెయ్యకుండా, ప్రియంగ సూపీ సూపకుండా, భయం సెప్పి సెప్పకుండా, నయం, భయం, దయా, హాయల్, డాబూ, దర్పంసూపీ స్వాధీనం సేస్కోవాల. (మోహినిని సమీపించి సైకి) మేరేప్యారీ ! మోహినీ ! జహాన్మోహినీ ! ఢిల్లీపాదిషానీకీ డౌలత్‌కీ జోహార్ సెప్తూవున్నారు.

మోహి—(ఉలికిపడి స్తబ్ధయై యూరకుండును.)

సలీం—కలూక్నై. పలూక్నై. టక్కర్‌వాలా టెకూక్ సేస్తూవుంది. మోహినీ మేరేప్యారీ ! దేరీక్యా ! జల్దీ మాకీ పానీకరో ! నీకీ మంచీమంచీ జవాహిరి నజర్ తెచ్చినామ్.

మోహి—(సలీమును జూచి తనలో) అక్కటా! తలఁచుకొన్నంతయుం జరిగినది యిఁక నాకు దిక్కేమి ?

సలీం—ఆ ! ఆ ! మాకేసీ సూస్తావుంది. తోడాతోడా మాసంగీతకం మజాసూపుతాం.

పాట—ఏకతాళం.

మేరేప్రియ ప్యారీ ! మనునికటారీ ! ॥ ఏరీ ! నీసరీ మెవ్వారీ జహాఁమే లేదాఁగదే సుందరీ ॥ మొహామెత్తి మాకీచూడు । ముద్దిచ్చి మాటలాడు । మొహామాట మిఁక నేల । మోహినీ రోహిణీ । జోహార్ కంబుకంధరీ ॥ మేరే॥

మోహినీ ! మొహామాటంతాని పక్కాతీసిరేసి మాకీ మంచిమాటా సెప్పు. ఢిల్లీకిపట్కా యెల్లి నీదీశరీరం దరోబస్తు జరీఆగా్ప్రిపాలామలామా సేస్తామ్. కాళ్ళకీ, సేతులీకి, గల్లాకీ, సెవులీకి పకా్కరకం రతన్ సమ్మాతాపటుం సేస్తాం. ఏదీ ! ఏదీ! హాకా ముద్దూమాకీయిస్తే జాస్తీబాత్ క్యా ఢిల్లీపాదుపామాదీహాస్తం నీదీపామ్ పకశ్ సేసి మం చీగౌరవమ్ సేస్తాదీ. నైతో జులుంసే బలాత్కారం సేస్తాదీ.

మోహి—హా! భక్తజనకల్పవల్లీ, సతీమతల్లీ! తల్లీ నాకిఁక నేమిదిక్కు!

శా. తల్లీ! పల్లవుచేతఁ జిక్కితిఁ బ్రమాదం బేమి వాటిల్లునో
తల్లిందండ్రియు నివె యొండెఱుఁగ నేతప్పావల్లంజేయ నా
పుల్లే రెవ్వరుఁ బ్రోవ నార్తజనబంధూ! సత్కృపాసింధు! నీ
పిల్లం గాళ్ళను జుట్టుకొంటి నిదె దేవీ! యేమి గావింతువో!. 120

సలీం—క్యా! క్యా! ఎంత నిదానంసేస్తావున్నా సవాలీకి. ఠీక్ సమాధానం మాని రోదన్ సేస్తావ్ ? నీకీగౌరవం బేగౌరవమ్ మాలుమ్‌నహీ. రాజారాజ్ మేము ఖుద్దునవచ్చి పాప్రిధేయంపడ్తావుంటే కికుర్ మనాక సోఫాపర్ యెక్కి బెఠూ్క సేస్తావ్. ఏదీ ! మంకీ తోడాజాగా సెయ్యి. (సోఫామీఁదఁ గూర్చుండును.)

మోహి—(చప్పునలేచి దూరముగాఁ జని)

కవిరాజవిరాజితము.

తొలఁగుర! యెవ్వరుతోలిరి నిన్నిట! దూరముగాఁ జను దుష్టమతీ!
తలపొగరా! కలుదాప్రివితివా! మతిదప్పిన పేప్రెలెదు తప్పనుముల్ !

నిలువకు మియ్యోడ! నీచెలియెవ్వరో నీచపుబుద్ధులు నేరిపి నీకా
దెలియక పంపె నదే చనుమార్గము! నిల్చితివా మరణింతువురా!

ధూర్తా! లేచి దూరముగాఁ బొమ్ము! లేనిచో నీకుఁ దగినశిక్షఁ జేయింతును.

సలీం—హాయిరే హాయి! మంచిమాటా సెప్పినావ్. మాకీశిచ్చా సేస్తావ్ కాదూ! హామేషా మేమూ నీదిశిచ్చాలో వుండిపోడానికే మాకీసంకల్పం. (మతింత దగ్గఱగావచ్చి)

పాట—ఆదితాళము.

నికాకరో సుందరీ! బుకాయింపు నకోనకో ॥ నికా ॥
రకారకం రత్న సరక్ । ముకామల్ ముస్త్రైబు నజర్
జోకాయించి పట్టుతామ్ । పకాపకా నవ్వ్మాకి ॥ నికా ॥
చారుఘోంఛా గాడిమేషి । కారు నీకి రోజురోజూ
దేరీక్యా మోహీని । తేరిమూంకు సిగ్గు ఏకు ॥ నికా ॥

(మీఁదికివచ్చి ముద్దుపెట్టుకొనఁబోవును.)

మోహి—(తనలో) త్రాగినవానికిఁ దగవేమి ? ఇఁక వీనితో సాహసమువలన ఫలము లేదు. (పైకి) ఓరీ ! ధూర్తా ! ఎంతచెప్పినను బుద్ధిలేదేమిరా !

చ. తగదని యెంతచెప్పినను త్రాఁగుడు బుద్ధులు మాన వేర! ధూ
ర్తగుణ! తొలంగిపోఁగదరా! తెగవైతును బోవకున్న నా
మగురుసితాసి నీక్షణమె తుండెముగాఁ దెగి వింతబంతి మా
డ్కి గిఱగిఱన్ శిరంబెగిరెన్ చదలం జెఱువేను మొంటిపై.

(గుప్తఖడ్గము నొఱనుండితీసి మీఁదికి వచ్చును.)

సలీం—(వెనుకకుఁ దగ్గి) అబ్బో! అబ్బో! బడేషైల్మాన్ వాలావుంది. అరే! గులాం. అరే! సిద్దిరాం! జల్దీఆవ్ దీని కాలూ సెయ్యికట్టియేసి మా మహాల్కి పట్కారా! అక్డాసేన్కి తగినబుద్ధి సెప్తామ్. (అని పోవును.)

మోహి—ఈత్రాగుఁబోఁతు తన పరివారముందోడుతేర నరిగినాఁడు. అసలే గోవాక్షకు మొనఁగాడు ఆమీఁద త్రాగినాఁడు. అధికారముగలవాఁడు. నేనో సంప్రాప్తయౌవననగు నాఁడుదానను. దీనను. సహాయహీనను. సమయమున కా జయసింహుఁడు చెఱసాలం బడిపోయెను. ప్రతాపునియుదంతములు తెలియ

వాయెను. తండ్రికభిమానములేదాయెను. అర్ధరాత్రము. శత్రుమధ్యము. గత్యంత
రములేదు. మానరక్షణకు ప్రాణపరిత్యాగముకన్న వేఱొండు వెఱవులేదు.

జయ—(గులాంవేషమునఁ బైకివచ్చి) ఇదే! మోహిని కలకదేటి యేమో యాలోచిం
చుచున్నది. కనుపడకుండ నిచ్చట నుండియే యీమెప్రయత్న మేమిరో
కనుఁగొందుంగాక. (పొంచి వినుచుండును.)

మోహి—(కత్తిమొన తనవంకఁద్రిప్పి) ఓ నాగుప్తఖడ్గమా!

చ. అదనునఁబ్రోవ బ్రాణసఖివై ధృతి నిల్పఁగ నంగరక్షవై
మదరిపులం వధింపఁదగు మారణమాత్రమవై సదా ననున్
వదలకయుంటి వొంటినెడఁ బాయక నేఁడిటు తప్పి వచ్చె, నా
హృదయముఁజీల్చి మానరమ నిల్పుమిఁకన్ సెలవిమ్ము ఖడ్గమా!

(అని కత్తిఁగొని గుండెపైఁ బొడుచుకొనసిద్ధురాలై) ఇఁక నొక్కసంగతి మఱచిపోయి
తిని. ఓ సింహవిక్రమా! జయసింహకుమారా!

చ. మెలకువతో ననుంగనిన మేలునకున్ మఱుమే లొసర్పఁగాఁ
దెలియక నీకు నప్పువడితిం జయ! యీభవమిట్టులౌట; రాఁ
గల భవమందునేని కలకాలము నీమృదుపాదపద్మముల్
గొలిచి ఋణంబుఁ దీర్చుకొనఁ గోరెద నిప్పటికిన్ క్షమింపుమీ.

సరే! ఇఁక నన్నియావశ్యకములుఁ దీఱినవి. ఓ యసిపుత్రికా! నీవే యీమందభాగ్యు
రాలికి శాశ్వతానంద సంధానకారిణివి. (అని గుండెపై పొడుచుకొనుచుండును.)

(గులామ్‌దుస్తులు ధరించియున్న జయసింహుఁడు చప్పునవచ్చి చేయిపట్టుకొని)

జయ—మోహినీ! సాహసము మాను. సాహసము మాను.

మోహి—అయ్యో! చెడితినిగదా! ఇఁక నేమిగతి?

భుజంగ. దురాచార! దుష్టాత్మ దూరంబుగాఁ బో
వరా! లేనిచో నీదుప్రాణంబుఁగొందున్.

జయ— వరారోహ! ఘోరంబు వారింపుమా నే
తురుష్కుండఁగాన్ రాట్సుతుండన్ హితుండన్. 125

సుందరీ! భయపడకు! నేజయసింహుఁడ (గులామువేషము దీసివైచి నిజరూపమును
జూపును.)

మోహి—(చప్పునక త్తిపాఱవైచి కేలుమోడ్చి) మిత్రరత్నమా! క్షమ్యాస్మి! క్షమ్యాస్మి! ప్రాణమిత్రమా! గర్భశత్రులందైనఁ దలంపరాని మహాపరాధము నేను మీ యెడలఁ గావించితిని. అట్టి మహాపాతకిని, అట్టి మిత్రద్రోహిని నగు నా మొగము మగుడ మీరేల చూడవచ్చితిరి?

జయ—సుందరీ! పాపము నీ వేమిజేసితివి? ఇప్పుడు మనకువచ్చిన ప్రమాదమేమియు లేదు. నీచిత్తము స్వస్థపఱుచుకొమ్ము.

మోహి—ప్రమాదమేలేదా, బ్రతికితి. మిత్రరత్నమా! శత్రుమధ్యముననున్న మనకుఁ బ్రమాదము లేదందురెందుచేత? పరిపంథికుంభికుంభస్థలవిదారణదారుణ నఖాగ్రంబగు కోదమసింగపుంగొదమ విధివశమునఁ బంజరమున బంధింపఁబడి యె. దురాచారదవానలంబు నల్దెసలఁ జుట్టుముట్టి తెక్కలురాక నడుమఁబడి యున్న దిక్కుమాలిన కపోతపోతంబును గాల్చివేయుచున్నది. ఇంతకు మించిన ప్రమాద మింక నేమున్నది!

జయ—సుందరీ! శాంతింపుము. మనమిప్పుడు ప్రమాదతరంగిణిందరించి దరిదగ్గితిమి.

మోహి—అసహాయశూరులగు మీరు సమీపించినంతనె ప్రమాదములన్నియు దూరములగునన్నమాట నిక్కవమే కాని—

జయ—కాని నాకింకను బంధవిమోచనము కాలేదని కాఁబోలు నీయభిప్రాయము.

మోహి—అదియైనది. ఇంక నాసంబంధమగు బంధమిదియొకటున్నది కదా.

జయ—ఎన్నఁడు నే నీబంధవిమోచనము మాత్రము వాంఛింపను.

మోహి—బంగారుదైనను సంకెల సంకెలయే. మనలోమాట- మీరిట్టిగులామువేషమూననేల? అదియేమి? ఱిరిగి యావేషమే వేయుచున్నారు వద్దు. వద్దు. (గులాము దుస్తులు తీసికొనఁబోవును.)

జయ—ఈవేషమే యాబంధమోక్షమునకు గురూపదేశము. స్త్రీవిద్యోపాసన. ఉండనిమ్ము. ఇంకను దీనితోఁ బనియున్నది. (వారించును.)

మోహి—ఆస్త్రీ యెవ్వరు? చంద్రికళయా?

జయ—కాదు. చంద్రికళకు మారణదేవతయగు చిత్రకారిణి.

మోహి—ఆచిత్రకారిణి యెవ్వరో ఆమెచరిత్రము కడువిచిత్రము.

జయ—మన బంధువర్గములోనిదే. మనకు సహాయముచేయుటకే వచ్చినది. వివరములు ముందు ముందుఁ దెలియఁగలవు.

మోహి—నే నట్లే యూహించితిని. మనవారింక నెందెవరున్నారు?

(తెరలో)

ఉ. శత్రులు కోటలోఁ దిరుగఁ జొచ్చిరి వేగుఁ గనంగఁ బెక్కులౌ
కృత్రిమరూపముల్గొనుచు నీతుగ మార్గము నాఁగి గోటలో హులువం
పత్రిక లేక యేరి విను దంజన దావుఁడి రాఁక పోఁకలన్
చిత్రగతి న్నివాస తతి చేయు పను ల్గనుఁగొని చూడుఁడీ! 126

జయ—వినుచుంటివా! దుర్గరక్షకుల హెచ్చరిక. ఉండుముండుము. మతియేదో విన వచ్చుచున్నది.

(తెరలో) ఓ దుర్గరక్షకులారా! భద్రము! భద్రము!

ఉ. కందక మందు నీర మధికంబుగ నింపుఁడీ; కేవ్వెరంగుల
మందుఘటింపుఁడీ! రిపుల మార్గములం గన కోటగోపురా
లందగు దూరదర్శనులు లక్ష్యమునుర్వుఁ డదే ప్రఘాతం సిం
గిందల కేగుదెంచెనఁట యీ ననబెబ్బులి కైపడి స్వశిన్. 127

జయ—సుందరీ! ఇఁక తడవుసలుటకు నాకు వీలులేదు. శత్రువుల యుత్తరువుల వినుచుంటివిగదా! మున్ముందు నీరుమందుగుండు సామాను నాశముచేసినఁగాని మనకు సాధ్యులు కారు. ఏమి? రిచ్చపాటును పరధ్యానమును నీ మోమునందుఁ గన్పట్టుచున్నవి!

మోహి—ఏమియులేదు. నిశ్శబ్దముగానున్న యీ యర్ధరాత్రిమునందల్లదే యుదయపురము పుట్టినిల్లుగాఁగలయొక వానకోయిలకూఁత వినవచ్చినది.

జయ—ఆచాతక మేమనుచున్నది?

మోహి—జీవనాతురయగు నాపక్షిజాత మేమనఁగలదు! కుహూకుహూయనియో కహా కహాయనియో.

జయ—పాప మాశాభంగమైనది కాఁబోలు. ఏజాతియైననేమి? బాధ సహింపరానిది గదా!

మోహి—నిజమే.

చ. కడు వడగాడ్పుచే నుడలు గాసిల వేసరి వానచిన్కకై
బడలి తపించు చాతకము పండోదవంబిఁక వర్షబిందువో

వడఁగలిరో లభించు నని వచ్చినమేఘుని గాంచిపొంగఁగా
పిడుగుపడెఁగదా యెటుల బిట్టువగన్నది మిట్టిపెట్టెనో. 128

జయ—సుందరీ! ఎందుకీయన్యాపదేశములు! నిరంతరము యుద్ధమే జీవనముగాఁగల మాయట్టివారి పుట్టు వెల్లపుడు నిట్టియాశాభంగములనే కలిగించుచుండును.

చ. పొడుపొడు! లెమ్ములెమ్మదిగో పోయెను బోయెనరాతిసేన! వె
న్బడు! నిలు! తగ్గు! మొగ్గరముఁ బన్నుడు నావినసౌను శాంతియె
క్కడ? పడవాలుపుట్టుగడెగండను, పోటరివంగడంబు న
న్బడమిటి నీకుఁదెల్పవలె నో చెలిరో పొలి సేపుపోకడల్. 129

ఏమిచేయను నావంటివానిజన్మము వ్యర్థము! నిరర్థకము!

మోహి—అట్లనుట ధర్మమా! నేనంత తెలివిమాలినదాననా!

ఉ. స్వార్థపరత్వమన్నది రవంతయులేక సతంబు దేశసే
వార్థము గడ్డిపోచవలె నర్థము బ్రాణము ధారవోయుటల్
సార్థకజన్మ మాతనది, స్వర్గము చూడుము రాచబాట, హా
వ్యర్థమటంచుఁ బల్కసరియా! మరియాదలు నేనెఱుంగనా!

(మఱలఁ దెరలో)

ఉ. వచ్చెఁ బ్రతాపసింగు నిజవాహినితోడ నదేయు దేపురిన్
జొచ్చెడు రేపొమాపొ! యిటుసోమరులై నిదురింతురేల? ఓ
బిచ్చపుజోదులార! రణభీరులు మీరలు రాజపుత్రులే
చిచ్చరెనేప్రతాపములు? చేతులనున్నవి విండ్లు? గాజులా? 130

మోహి—ఇదియేమి? ఈహెచ్చరికతీరు! అశ్రుతపూర్వముగా నున్న దే!

జయ—ఇదిపేఱు! మనరాణకవి ప్రయోగించిన భేదనోపాయమను శతఘ్ని. ఇఁక నొక్కగడియైన తడయరాదు. నాకు సెలవిమ్ము.

మోహి—చిత్తము. పునర్దర్శనభాగ్యమెప్పుడు?

జయ—ఎట్లు చెప్పనగు? పోవునది యుద్ధభూమిగదా!

ఉ. ఆయువుగల్గె నేని సమరావనిలో రిపులన్వధియించి నీ
పై యెలమిం గొన స్వజయగర్వముతో జనుదెంతు రేపె లే

దా యస్సీమ కీతనువు నర్పణ చేసి దివంబుఁ జేరి నీ
కై యట వేచియుండెద లతాంగిరో! యచ్చపు బ్రహ్మచారినై.

మోహి—భగవదనుగ్రహము వలన మనకు శుభమే చేకూరుఁగాక.

జయ—మోహినీ! ఇదే కత్తి! దీనిని బ్రార్థించి నీయాశీర్వచనము నాకు దయచేయుము.

మోహి—(పుచ్చుకొని ముద్దుపెట్టుకొని) ఓ శస్త్రరాజమా!

శా. మేలున్గెల్పుఘటింప నేర్తువని మన్మిత్రుం డెద న్నమ్మి ని
న్గేలంబూనుచు సాగరోర్వీసుతుఁ గన్నెఁ(డా)చె నేలోటు దో
ర్లీలామగ్న మనస్కుఁడై తిరుగు దో లేకుండఁగాఁ జేసి యా
యాలంబంమున గెల్పుమాకు దయ సేయంజూడుమా శస్త్రమా.

జయ—(మోహిని దీవించి కత్తియీయఁగాఁ బుచ్చుకొని నిష్క్రమించును.)

తెర జాఱును.





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము

## (రాణా ప్రతాపసింగు)



## షష్ఠాంకము.



### రంగము — ఉదయపుర పుకోట - విష్కంభము

[వ్యాకులచిత్తముతో సాగరజీ ప్రవేశించును.]

సాగ — (ప్రవేశించి తనలో) ఆహా! ఎంతబుద్ధిమాలినవాఁడనైతిని. ఆ కులభ్రష్టు మానసింగు నాకేమో శాశ్వతబ్రహ్మపట్టముఁ గట్టునను పుట్టెడాసతో పట్టరానివారి కాళ్ళను పట్టి, చేయరానిహీనకార్యములను చేసి, పడరానికడగండ్లంబడి తుట్టతుదకుఁ గడుపునఁబుట్టిన ముద్దుపట్టి మానధనము సహితము కులహీనుల కమ్మ చూపితి. దేశద్రోహిని, భ్రాతృద్రోహిని, ఆద్రోహముల ఫలమే నన్నిన్నిగతుల కట్టికుడిపింపుచున్నది. నిన్నటిరాత్రి మూఁడవజామున నామానసింగు సలీమును వెంటఁబెట్టుకొని బ్రతుకుజీవుఁడాయని యేదోవేసమునఁ గోటదాఁటి తనదేశమునకుఁ బాఱిపోయెనని కొందఱనుచున్నారు, మఱికొందఱిందే యేమూలనో తలదాఁచుకొనియున్నాఁడందురు. నేనిక్కడ కార్చిచ్చునడుమ మిడుతవలె శత్రుమధ్యమునఁ జిక్కియుంటిని. మాసేనలన్నియు భీభత్సములయ్యె. ఇప్పట్టున శరణాగతరక్షకుఁడగు మాయన్న ప్రతాపునిపాదములు పట్టుకొనుటకన్న వేఱొండుగతిలేదు. అదిగో! చాణకవి యెవ్వరినో బంధించి యిటుఁ దీసికొని వచ్చుచున్నాఁడు. వానికిఁ గనుపడకుండ నీమూలనక్కి యిప్పటికిఁ బరువుఁ దక్కించుకొనియెద.

[అంత బాణకవి మోహినీ జయసింహుల వేషములనున్న చంద్రికళను, గులామును గొలుసులతో కట్టి తోడ్కొనివచ్చుచుఁ బ్రవేశించును.]

బాణ—(ప్రవేశించి) వంచకీ వంచకులారా ! మీ రీవేషములు వేయుటకుఁగల కారణ మేమో యున్నదున్నట్లు చెప్పుఁడు. లేకున్న మిమ్మిక్కడనే నఱికివేసెదను.

గులా—మహారాజ్ ! ఈ సానీదానిమీది మోహం మాకీయింత ద్రోహం తెచ్చింది. టక్కర్ వాలా సితారికారిణీ నాకొంపాతీసింది. ఈవేషం యేయించింది. తక్సీర్ మాఫ్ మహారాజ్. మాకీ యిడ్సిపెడ్తే మీ కాళీఘూళీ హోసాకె కస్పడ్ కుంఠా ఘూలిలో మెగిరిపోతామ్. యిడ్సిపెట్టు మహారాజ్ యిడ్సిపెట్టు.

బాణ—సరే! నిన్ను విడిచిపెట్టుటనుగురించి వెనుకనుండి యాలోచింతును. నీవు నాతో చెప్పినదంతయు నిజమేకదా! ఓ చంద్రికళా ! నీవీవేషము వేయుటకు హేతువేమి?

చంద్రి—నేనేమియు నిప్పుడు చెప్పఁదలఁచుకొనలేదు.

బాణ—సరే! రాణావారి యెదుట నిగ్రహింపఁబడునప్పుడు చెప్పుదువుగానిలే. రండు. రాణావారి సముఖమునకు రండు. (తీసికొనిపోవుచుండును.)

(తెరలో జయసింహుఁడు డంకామ్రోయించి)

శా. రండీ ! మూఁతులమీసముల్ గలుగుశూరన్మన్యులిందున్న దో
ర్దండప్రౌఢిని మానప్రతాపుని ధ్వజస్తంభంబు చేపూను కో
టుం డంకాపయి దెబ్బఁగొట్టి యిదె నాటంబోవుచున్నా నెదు
ర్కొండీ! యోపఁగరండి భీరులగు వీరుల్ బీరమున్నట్టిచో. 132

(జయసింహుఁడు గులామువేషమున పయికివచ్చి) ఓసాగరమానసింహ ప్రభృతులారా ! శూరమ్మన్యా సలీం రాకుమారా ! మీరవ్వరు నెదుటఁ బడరేల? (నైపథ్యమునే తిరిగిచదివి)

ఇదిరేమి? మానసింహప్రభృతులు మాయమైపోయినారా !

సీ. వృద్ధుఁడౌరాణనుల్లు వివశుఁడై పడియుండ
పీ డరికట్టిన బింకమూఁచి
గుణములపోవు మోహినిశీలరాజంబుఁ
బోఁద్రోల నెంచిన పూని కాపి

చచ్చితి మీకుఁ జాలు సంగరంబని భటుల్
కొనయూర్పు గాడ్పు ముక్కులని పీల్చ
తనమాటనమ్మి కీర్తిని దొఱఁగితిమని
విలపించుచుండఁ బృథ్వీవరాళి
తోడిమిత్రుల దుఃఖాబ్ధిఁ ద్రోసివైచి
యెందుఁజనె మానసింగు గన్పించఁడిపుడు
భైరవీమాత కిడె వాని బలియొనర్చి
దేశసంకట మింతతోఁ దీసివైతు. 133

బాణ—ఇంకను మానసింగెక్కడ? జయసింహా! అదియేమియావేషము!

జయ—ఎవరది! బాణకవిశిరోమణియా! నమస్కారము. ఏమంటివి? మానసింగేమయ్యెనో చెప్పుఁడు. నావేషము మాటకేమి?

బాణ—ఏమయ్యెను? నిన్నటిరాత్రి మూడవజామున నే సలీంరాజకుమారునితో మాయమయ్యెను. ఇప్పటికి కోటలోఁ జిక్కిన ద్రోహులు వీరెయురే. (గులాము చంద్రకళలను జూపును.)

జయ—వీరెవ్వరు? వేషధారులవలె నున్నారు?

బాణ—వీరును నీవలె వేషధారులే. వీరివృత్తాంతము వెనుకనుండి చెప్పెదను. రాణావారిదర్శనమునకుఁ బోవుదము రమ్ము.

జయ—సరే! అదియెవ్వ రామూల నెవ్వఁడో నక్కవలె నక్కి నిక్కి చూచుచున్నాఁడు.

సాగరజీ—(అంత పైకివచ్చి చేతులుజోడించుకొని)

చ. శరణుమహాత్ములార! ననుసాకుఁడి సోదరుపాద రేణువుల్
శిరమునఁదాల్చి కొల్తునిఁకఁ జేసితి మీయెడ నెన్నియో మహా
దురితములన్ దురంతమగు ద్రోహములం గణియింపకండి; సో
దరునకుఁదెల్పి నన్నుఁ దమదాసునిగాఁ గొనునట్లు చూడుఁడీ!

బాణ—ఇదియేమి? సాగ్రిజీమహారాణావారా! పరివారమెచ్చట? దిక్కుమాలి యిక్కడ నక్కి నక్కి వెక్కి వెక్కి దొంగయేడ్పు సేయుచున్నారు! రండు.

ఈబంగారుగొల్సుల మీ రంగారు ముంగేలు సింగారింపనిండు. రాణావారిముంగల నన్నిసంగతులు మనవి చేసికొందురుగాని దయచేయుఁడు.

జయ—కవిశిరోమణీ! శరణార్థియగు నీతని నిప్పుడేల యెత్తిపొడిచెదరు! రాణావారి యెదుట కిట్టులే మనతోడ రానిండు.

బాణ—కుమారా! తానున్న మామగారు గదాయని గౌరవముచూపుచున్నావా? నీయాప్సితమే కానిమ్ము.

[అంత చాటుచు జాంఘికుఁ డొకఁడు ప్రవేశించును.]

చ. నతులుగ్రహింపఁగన్ బసదనంబులు గైకొనఁగ స్పృహాకృతుల్
నుతులు గొనంగరండు స్వజనుల్ రిపుజైత్రుఁడు మాప్రతాపభూ
పతి దయచేయు నిప్పుడు సభాస్థలికిన్ విజయశ్రిమోద స
త్కృతుల స్వయంబుగా నొసఁగ, కీర్తిరమంగొనఁ బంటకాఁటిదే.

బాణ—జయసింహకుమారా! రమ్ము రమ్ము! నేఁడు నీకు విజయపారితోషికమ్ములు కుప్పలు కుప్పలు. రాణావారిప్రకటన వినియుంటివిగదా! రయమ్మునఁ బోదుమురమ్ము.

(అందఱు నిష్క్రమింపఁగాఁ దెరజాఱును)



రంగము—ఉదయపురపుకోట.



[ప్రతాపసింహుఁడు, అమరసింహుఁడు, పృథ్వీరాజు ఉచితాసనములపయి విశ్రమించియుందురు.]

ప్రతా—ఆర్యా! పృథ్వీరాయా! జయసింహుఁడు శిక్షార్హుఁడే.

చ. రవి తనత్రోవదప్పిన ధరాతలముం దివి రెండు నేకమై
నవసిన నగ్నిచల్లఁబడినన్ శశి డుల్లిన నీప్రతాపభూ
ధవుని యమోఘశాసనము తప్పదు, వాదమదేల దేశవి
ప్లవకరుతో కృతఘ్నుజనపక్షమునం బృథివీతలేశ్వరా! 134

పృథ్వి—దేవా! నాదొక్కమనవికలదు. చిత్తగింపవలయు.

మ. జయసింహుం బిలిపించి యాతని సమక్షంబందె ద్రోహాస్వభా
వయథార్థాంశము లెల్లఁ దెల్పి మును తద్వాఙ్మూలమాలించి త

ద్దయు తత్పక్షము వారి సౌఖ్యము సమాధానంబును జిత్తగిం
చి యటోయిట్లోయొనర్పుఁ డాపయిభవచ్చిత్తంబు తద్భాగ్యముగ్.

ప్రతా—సరే! మీరుచెప్పునది సమంజసమే గాని ఏడీ! ఆజయసింహుఁ డిప్పు డెక్కడనున్నాడు?

అమర—ఎక్కడనున్నాడు! నిన్న నే మానసింహాదులతోఁ గలిసి ఢిల్లీకి పాటిపోయియుండును. కాని నిన్న నారాజద్రోహియగు జయసింహుఁడు మోహినీ ప్రేరితుండయి సలీము మానసింగులఁ గోటదాఁటించుటయు, ఎదిరింపఁజనిన నాపయి డీకొనుటయుఁ గొంచెము దూరములోనుండి తమ కన్నులతోనే చూచుచున్న మామయ్యగారు పృథ్వీరాయలుకూడ నిట్లనుట నా కత్యద్భుతముగ నున్నది. సమయమున కాతురుమ్క యోధు లిరువురు బాసటగాకున్న నీపాటికి మాపాప్లేమయియుండి యుండునో.

పృథ్వీ—అవును మోహినీజయసింహుల రూపమునను్న యిరువురు మనుష్యులట్లుచేయుట నేనుచూచియున్నాను. కాని చిరంజీవి యూహించినట్లు వారుతప్పించుకొని పాటిపోలేదు. బాణకవి వారిని పట్టుకొనినాఁడు.

ప్రతా—అయిన సంతోషమే. కాని కవిశిరోమణి యేలొకో వారినింక నింకుఁ దోడ్తేలేదు.

పృథ్వీ—నేటిదర్బారునకుఁ దోడ్కొనివచ్చునేమో.

ప్రతా—సరియే వారువచ్చినవెనుకనే విమర్శింతము. కాని మఱచితి. నిన్నటియుద్ధములో చిరంజీవికిఁ దమంతన బాసటయై ప్రాణావసరసమయమునఁ దోడ్పడిన యోధానుయోధు లాతురమ్కవీరు లిరువురు నింకను యుద్ధపాళితోషికములంది యుండలేదు. వారిపుడెందున్నారో?

పృథ్వీ—అభ్యంతర మందిరమున. సెలవైనఁ బ్రవేశపెట్టుదును.

ప్రతా—మంచిది. సత్వరముగ.

పృథ్వీ—(నిష్క్రమించును.)

[బాణకవి జయసింహ సాగరజీలతోడను మోహినీ జయసింహులరూపములనున్న
గులాము చంద్రికశశిలతోడను ప్రవేశించును]

బాణ—(హజారమునసుండియే) మిత్రమా! జయసింహ! ఈతొందరలో నత్యంతావసర కార్యమే పరాకుచెందితిని. రత్నపురీకణమల్లుని శాసనపత్రికారము నేఁడు తెరపింపఁదగు గుప్తపేటిక మనసాంకేతికస్థలమున విడిచివచ్చితిని.

జయ—సరే! నేఁబోయి దానిని కొనివచ్చెదను.

బాణ—ఉన్నపాటున రావలయును.

జయ—(నిష్క్రమింపఁగా తక్కినవారు రాజసముఖమునకు వత్తురు).

ప్రతా—కవిశిరోమణీ! స్వాగతము. సమయమునకే విచ్చేసితిరి. ఈతఁ డెవ్వరు? సాగరికీయా?

బాణ—మునుపటితమ్ముఁడు కాఁడు. పశ్చాత్తాపతప్తుఁడగు సోదరుఁడు.

ప్రతా—కవిశిరోమణీ! ఈతనిపక్షమున మీ రేదో చెప్పఁదలఁచుకొని నట్లున్నది. ఆ సంగతి వెనుకనుండి యాలోచింతము. ముందు మోహినీజయసింహులను మాయెదుర నిలుపుఁడు.

బాణ—(అట్లుచేసి సాగరికుని తనసికొనిపోవును.)

ప్రతా—కవిశిరోమణీ! అతని యుక్తస్థలమున నిలిపి మీరు రయమున రావలయు. ఈ విచారణయందు మీసాక్ష్యమే ముఖ్యము.

[పృథ్వీరాజు తురుష్కయోధుల వేషములనున్న కమలామోహినులతో ప్రవేశించును]

ప్రతా—(లేచి నిలఁబడి చేతులుపట్టుకొని.)

ఉ. రంకమదాప్రతిస్పర్థి తురుష్కులు మీరు మహోన్నత నమస్కృతుల్
గొందు, మదీయసంఘమునకున్ దగుభాసటలై స్వకీయ దో
ర్దండ బలంబునన్ మ్రందటఁ బ్రాణములిచ్చిరి, మీరు మేలు నె
న్నందును మఱ్ఱఁజాలము ఋణంబును దీర్పఁగఁజాలమేమియున్.

ఉభయు—దేవరవారి ప్రాణముతోఁడిదే లోకమను భృత్యవర్గములోని వారము. మాకింత ప్రత్యుత్థానమేల?

అమర—విజాతివారైన నట్లుండవలెగదా యభిమానము.

కమలా—కుమారా! భగవంతుని దృష్టికి కన్నిజాతులు లేవు. రెండేజాతులు. స్త్రీజాతి పురుషజాతి. అయినను మేము మీకు విజాతివారమనుచున్నారు గనుక నిప్పటికి మీచిత్తమువచ్చినట్లే భావింపుఁడు.

పృథ్వీ—ఏమి కీమాటల సందర్భము. ఆకినఁడియు వీరివేషభాషలు నాకుసంశయాస్పదములుగానే యున్నవి.

క. వేసములుచూడ పురుషుల
వేసము లేగాని మీఁది పెదవులపై లే

మీసములుగాని పురుషా
భ్యాసంబులుగాని కానఁబడ వదియేమో. 136

ప్రితా—పృథ్వీరాయా! మీరుచెప్పినట్లు ముం దీమోహినీజయసింహులపై మోపఁబడిన నేరము విచారింతము. మనమిత్రు లుభయులు నిందు ప్రాడ్వివాకులుగా నుండఁ బ్రార్థితులు.

ఉభ—(ఒండొరుల మోములు చూచుకొనుచుందురు.)

ప్రితా—మిత్రరత్నములారా! సందేహింతురేల?

కమలా—మాకేసందేహమును లేదు. నేరస్థు లంగీకరింపవలయునుగదా!

ప్రితా—(మోహినీ జయసింహరూపులతో) మీకిష్టమేనా?

గులాం—అచ్ఛా! అచ్ఛా!

ఉభ—సరే! అంగీకరించితిమి. ద్రోహస్వభావము వినిపింపఁదగు.

ప్రితా—వీరు దేశవిరోధులగు సలీం మానసింగులను కోటదాఁటించి రాజద్రోహమను నేరముచేసిరి. అంతతోఁగాక నిరోధించిన యువరాజును జంపనుంకించి రాజహత్యోద్యమమను గొప్ప నేరమును చేసిరి.

ఉభయు—చిత్తము. (దోషులతో) ఈనేరములను మీరుచేసినారా?

గులాం—చేసిందీనహీఁసర్కార్. మేముచేసింది అంతా ధర్మం. ద్రోహంకాదు. నేరంకాదు.

అమర—ఇదేమిజయసింహా! తురకల నాశ్రయించినంతనే తురకభాషయబ్బవలెనా! క్రమముగా మాటలాడుము.

కమలా—వానియిచ్ఛవచ్చినట్లు మాటాడనిండు. వానిభాషతో మనకుఁ బనిలేదు. (చంద్రికతో) ఓయువిదా! పయినేరములను నీవుచేసియుంటివా!

చంద్రి—(నిర్లక్ష్యముగా) లేదు.

అమర—చూచితిరా వీరిసాహసము!

కమలా—యువరాజా! ఇప్పుడు మీ రేమియు ననరాదు. విచారణమధ్యమున మన మెట్టి యభిప్రాయమును సూచింపరాదు.

ప్రితా—ఓయీ! యువకుఁడా! అడిగినదానికి సదుత్తరము చెప్పుము. నీవు జయసింహుఁడవగుదువా కావా?

గులాం—నైనై. మేము పక్కారకం తుర్కోకీడ్డ. హాంఖడీక్యా ఫట్టి హాంఖడ్‌నామ్ సెప్పేదీ హమారీ యిస్లామ్‌మే నహీ. మేరేనామ్ నసూరీర్ మహమ్మద్

హోదా గులామ్. సాకిన్ ఢిల్లీషహర్. మాఖోటాసర్కార్ సలీమ్, మన్సబ్ దార్ రాజామాన్సింగ్ దోఆద్మీ మేం జఫర్దస్తమే ఖిల్లా దాఁటించియేసి వామ్. మాకీ అది ద్రోహం కాదు ధర్మం.

ప్రతా—సరే! ఓయువతీ! నీ వేమేని చెప్పుకొందువా!

చంద్రి—అతిపవిత్రంబగు శిశోదియావంశజాతనగు నేనీ కొలువు కూటంబున నిందతిచే విచారణచేయఁబడుటయే చాలును. నే నేమియుఁ జెప్పఁదలఁచుకొనలేను. మీచిత్తానుసారము చేయుఁడు.

కమలా—పోనీ! సాఁరజీపుత్రికయగు మోహినీబాయి నీవగుదువో కావో చెప్పుము.

చంద్రి—కాకేమి?

మోహి—నీవు మోహినివా! (కోపముతో) ద్రోహిణీ! నీవేనా మోహినివి? ఏదీ! నా మోమువంకఁ జూడుము.

చంద్రి—ఓ కొంటుకురకా! ఇట్టి నిండుకొలువుకూటంబున మాబోంట్ల బోటుల పరిహసించుటకా నీకిట్టియధికార మీయఁబడియె.

కమలా—(మోహినితో రహస్యముగా) నెచ్చెలీ! శాంతింపుము. నిజమునిలుకడమైపై తేలక తప్పదు. మధ్య మనకేల కంఠశోషము.

[అంత బాణకవియు, గులాము వేషమున జయసింహుఁడును గుప్తపేటికతోఁ బ్రవేశింతురు.]

ప్రతా—కవిశిరోమణీ! రండు రండు. (సభ్యులతో) ఆర్యులారా! అత్యంతపవిత్రమైన కార్య మిప్పుడొకటి జరుగనలసియున్నది. కావున క్షణకాల మీవిచారణ విరమింతము.

అందఱు—మహాప్రసాదము.

ప్రతా—(పేటికనువిప్పి) ఇయ్యది కులవృద్ధు రత్నపురీశులు గల్గుఁ డుదయపురము స్వాధీనమైననాఁడు తెఱపింపవలయునని మావశముచేసిన పేటిక. నేఁడు మా ఉదయపురము స్వాధీనమైనది గనుక మీయందఱి సముఖమున దీనిఁ దెఱచి యిందు నిక్షిప్తమైన వాని వెలిఁబుచ్చెదము.

మోహి—(అత్యంతాతురముతో గమనించుచుండును.)

ప్రతా—అమూల్యములగు రత్నాభరణములుకలవు. వానికేమి? అతఁడొక శాసనము వ్రాసియుంచెను. ఆకర్ణింపుఁడు.

చ. కలదు మదీయపౌత్రి సుగుణాత్రి పవిత్రచరిత్ర మోహినీ
కులమణి తల్లిచావు పసికూన యొకండిది, దీనినీయఁగా
వలయు శిశోదియాధ్వజము ప్రప్రథమంబున నీయుదేపురీ
గడెమున నాటువాని కులకాంతగ నాదగు రాజ్యలక్ష్మితోన్.

వింటిరా ! ఆకులవృద్ధశాసనము. ఏదియెట్లయినను మన నూరణమల్లుని శాసనము చెల్లింపవలయు.

బాణ— తప్పక చెల్లించితీరవలయును. కాని మనబాపుటా మొట్టమొదట ఈ కోటలో నాటినవారెవ్వరో?

పృథ్వి— జయసింహుఁడే యనుచున్నారు.

బాణ— (నవ్వుచు) కాదు గులాబుని కొందఱనుచున్నారు.

జయ— దేవా ! ఉదేపురి గడెమున దేనరవాని పతాకమెత్తిన సేవకుఁడ నేను.

ప్రతా— ఇదియేమి సర్వము సందిగ్ధముగానే యున్నది. నిప్పుకొలంది చిక్కుపడుచున్నది. మోహినీజయసింహుల రూపములున్న యీవేషధారు లెవ్వరో తెలియదు. నిజమయిన మోహినీజయసింహులజాడ కానరాదు. ఢిల్లీని విడిచి యుదయపురము చేరినదని బాణకవిచెప్పిన నాసోదరి కమలాబాయి యున్నదిక్కడ నెక్కడను గానరాదు. ఈతఁ డెవ్వరో యింతముందుగా జయధ్వజము నాటితినని తా ననుచున్నాఁడు. కాని యిందు సర్వత్ర యొక్క విచిత్రము మాత్రము కన్పట్టుచున్నది. శత్రుమిత్రపక్షములు తాఱుమాఱైనవి.

కమలా— చిత్రము. శత్రుమిత్రలక్షణము బహిర్వేషములను బట్టియే నిశ్చయించిన నట్లే కన్పట్టును. ఈకాలములో కొందఱు రాజబంధువులే రాజద్రోహముల రహస్యముగాఁ జేయుదురు, జేయించుదురు సాధులను నెలవారి యాందోళనలలోఁ చావా దువేయుచున్నారు. ఇప్పుడామాటలేల. శిశోదియాజయధ్వజము తొలుదొల్త నీగడెముపై నెలకొల్పిన శుద్ధవీరుఁ డీగులాబు వేషధారియే. తప్పనుయెడల నాతఁ డొక సింహనాదమొనర్చి తన్నువారించువా రెవ్వరేని యున్నారాయని పెద్దయెలుంగున ప్రతిజ్ఞచేసెను.

బాణ— అందు సత్యేతర మించుకంతయు లేదు.

ప్రతా— అయిన రణమల్లుశాసన ప్రకారము మనమోహిని నీతనికిచ్చి వివాహముచేయ వలసినదేనా ! అంతయు గందరగోళము ! అగమ్యగోచరము ! ఓసభ్యులారా ! మీ కందఱ కొక విజ్ఞాపనము.

చ. సరవి నగూఢవేషముల సభ్యులు మమ్ము భ్రమింపఁ జేయ నా
తరమగునే నిజంబెఱుఁగ, దాఁచకుఁడీ జయసింహుఁడేడి? సో
దరి కమలాంబుజాక్షియు సుతాయని మోహినియేది? వీర లి
ద్దరు నెవ రింక భ్రాంతినిడుదుఁడో యకటా యున్నటుల న్వచింపుఁడీ.

బాణ—(లేచి చేతులు జోడించుచు) ప్రభూ! కొంతవఱకైనను కపటము కొంతవఱకు వినోదము కొఱకు నొనర్చిన మా యపచయము క్షమింపవలయు.

సీ. పూనిగూఢంబుగా రూపు జయస్వాంబెత్తె
సింహాసనస్థుఁడు జయసింహుఁ డితఁడు,
మగవేషమున సమిత్రత సోదరుఁ
దలఁగాచె మోహినీతరుణి యీమె,
చేలఁ బాపికొన జయసింహుఁ డిచ్చిన నన్ను
ల సలీము నెకపెం గులాము వీఁడు,
వంచించుటకు శేరు వజీ రిది గాంచ దద్రి
కళయాను చెంచెటి బోగంపుఁదొత్తు
పాటపామీరాఁడి కని ఢిల్లిఁ బాసి యుదయ
పురిఁ బ్రవేశించి మోహాంగి సుప్పుఁ బాప
చిత్రకారిణి గాను విచిత్రగతుల
మానకుఁ దోడ్పడె కమలాంబుజాక్షి యీమె. 139

ప్రతా—(సంతోషముతో)

ఉ. ధన్యుఁడనైతి నమ్మ సిగదానుకు నాతఁ డుయుండఁ దోఁడి రా
జన్యుల బంధుమిత్రతతి సన్నిధిఁ బెండ్లిను యట్లు త్రోఁచి రిం
క న్యశమైన నేమికలుగన్ సరియే మఱి మా చితూరుగా
కన్యవిచార మేది హృదయంబున లేదవశిష్ట మద్దినమే. 140

బాణ—దేవా! తమకావిచారమేల? ఉదయపురమువలెనే చిత్తూరును స్వాధీనము కాక తప్పదు. కాని కొంచెము కాలము పట్టును.

ప్రితా—కానీ! దైవచిత్తము! గులాముకు క్షమించినారము. తలచుమించిన పరువులె త్తిన చంద్రికళ గులామును పెండ్లిచేసికొన్నచో క్షమింపఁబడును. తక్కినసంగతు లిప్పు డభ్యంతరమందిరమున జరుగనున్న కుటుంబసభలో నాలోచింతము. మనవారు తమ తమ నిజరూపములతో నాసభకు రాఁ బాత్రితులు.

(అందఱు నిష్క్రమింతురు.)



రంగము—కోట. రాణావారి యభ్యంతర మందిరమునకుఁ బోవుమార్గము.

---

[లోపున రాణావారు బంధుమిత్రులతో విశ్రమించియుండఁగా హజారమున కమలామోహినులు ఉచితవస్త్రాలంకృతులై ప్రవేశింతురు.]

కమలా—కోడలా! రయమ్మున రమ్ము. అభ్యంతరమందిరమున కప్పుడే జయసింహాదులగు మనబంధువు లందఱు విచ్చేసియున్నారట.

మోహి—అప్పాజీ! ఇదేమోగాని నాకు రాకున్నది. కరుణించి యీకొక్కెముక్కెంచుక సడలింపుఁడు. ఇందాఁక దయమాలి మాలిని బిగించివేసినది.

కమలా—ఏకొక్కెము? పైటబిగింపు కొక్కెమా! (వచ్చి సడలించి) దీని నింత బిగియఁజేసినది మాలినికాదు.

మోహి—ఆమెగాక మతియెవ్వరు?

కమలా—నీయౌవనప్రాదుర్భావము. మోహినీ! ప్రియునామోచ్చారణమే యింతయుబ్బింపకలయునే నీకొమరుఁ బాయంపు—సుందరీ! జీనసింగారించుకొనుసరికే యీరుమాటుమణి గెనన్న సామ్యము నిజముసేయుక వడి వడిరా! మనకై వారు వేచియుండుట భావ్యముకాదు.

మోహి—అదియేమోగాని వారిని సందర్శించుటకు నాకడుగులు తడఁబడుచున్నవండీ! కరుణించి మీకైదండ యొసంగరూ?

కమల—వధూమణీ! కైదండవలయునా? ఇదేపూదండ. దీని మా జయసింహకుమారున కొసంగినచో నీకతఁడు దనకైదండ నొసంగఁగలఁడు.

మోహి—అప్పాజీ! పోనిద్దురూ! మాట మాటకు హాస్యములేనా? ఆస్థానము సమీపించితిమి. మీపున్నెమాయె నూరకుండుఁడు.

[తెరలేచును. లోపున ప్రతాపాదులు విశ్రమించియుందురు.]

ప్రతా—జయసింహకుమారా! నీఋణము మేము తీర్పఁజాలము.

మ. తోడుగఁ దిండికి లేక కొండగుహలందున్ డిందు మా కాత్మబం
ధుఁడవై మిత్రుఁడవై జయప్రదుఁడవై దోఁబుట్టువై యెన్నియో
కడగండ్లం బడి నేఁ డుదేపురిఁ బతాకం బెత్తి మత్త్రాం జై
త్రుఁడవై నొప్పితివయ్య నీఋణమిఁ కేరూపంబునం దీర్తుమో.

బాణ—ప్రభుచంద్రమా! జయసింహుని ఋణమప్పుడే తీరిపోయినది.

ప్రతా—ఎట్లు?

బాణ—దేవరవారి వాగ్దానముచే సగము, ఇప్పుడు చేయనున్న కన్యాప్రదానముచే మిగిలిన సగము.

ప్రతా—(నవ్వి) అట్లా! ఇట్టిదానము లెన్నియేనియు వానియభిమానమునకుఁ దగిన బహుమానములుకానేరవు. ఏదీ! వధూమణియగు మనమోహిని నింక నలంకరించి తీసికొనిరాలేదా?

బాణ—ప్రభూ! వచ్చినారు. అదిగో సోదరి కమలాదేవిగారు మోహినీద్వితీయులై యిచ్చట వేచియున్నారు.

ప్రతా—(లేచి) ఏదీ నాప్రియసోదరి కమల. (వచ్చి చేతులుపట్టుకొని)

మ. ఇరువంశంబుల నుద్ధరించితివి తల్లీ! వంశపావిత్ర్యమున్
మరుఁగున్ నిల్వఁగఁ బెట్టి ధూర్తమతి నక్బర్ షాదుషా యంతవా
డరికట్టన్ తృణమట్లు చూచి నిజపాదాక్రాంతు గావించె నీ
చరితం బశ్రుతపూర్వ మోగుణఖనీ! సౌశీల్యచూడామణీ. 142

బాణ—మహాప్రభూ! దేవిగారుచేసిన సహాయము లింక ననేకములుగలవు. తరుణమున ధనసహాయము; జయసింహుని బంధవిమోచనము; చిత్రకారిణియై మనకు దుర్గరహస్యము లెఱిఁగించుట. మోహినికిఁ బ్రాణదానము.

కమలా—కవిశిరోమణీ! ఇది మీయాశీర్వచనఫలముగాని నాచేసినదేమున్నది! (చేరి తనభర్తయగు పృథ్వీరాజునకు నమస్కరించును.)

పృథ్వీ—(చేరదీసి) కల్యాణీ! నీయట్టి యర్ధాంగలక్ష్మిని బడయుభాగ్యము కల్మికి నే నెంతయు గర్వపడుచున్నాను.

ప్రీతా—సోదరీ కమలా! ఆలస్యమేల కుమారునకు కోడలిచేఁ బూలహారము వేయింపుము.

మోహిని—(సిగ్గుపడి వెనుకకు బోవును.)

కమలా—మోహినీ సిగ్గేల. (బలవంతముగా జయసింహుని మెడలో పూలహారము వేయించి వధూవరులచేఁ బెద్దలకు మ్రొక్కించును.)

ప్రీతా—మిత్రులారా! పశ్చాత్తాపతప్తుఁడగు సాగరజీ క్షమింపఁబడియె. బాణకవి శిరోమణి ప్రధానమంత్రిపద మంగీకరింపఁ బ్రార్థితులు. ఇఁక చిత్తూరు సాధించు ప్రయత్నములు నిరాఘాటముగా జరుగును గాక. మోహినీజయసింహులు రత్నపురిని పట్టాభిషిక్తులయ్యెదరుగాక.

బాణ—ప్రభుచంద్రమా! మహాప్రసాదము.

## భరతవాక్యము.

రాయలు నిరంకుశత గ్రాలెడు ప్రభుత్వముఁ దొ
ఱఁగి నియమంబుగఁ బ్రజాభి
ప్రాయమును గాంచు పరిపాలనముఁ జేయునెడ
పాడియును పంటయును భవ్యా
దాయములు వృద్ధియగుతన్ ప్రజలు ధర్మగతి
దప్పక ధరాధిపుల భక్తిన్
మాయయును మర్మమును మాయఁగనుఁ గొల్చుతఁ గ్ర
మంబుగను మంగళమహాశ్రీ.

అందఱు—తథాస్తు.

సమాప్తము

